# సర్వతోముఖ వేదాంతం



శ్రీ స్వామి వివేకానంద

# సర్వతోముఖ వేదాంతం

స్వామి వివేకానంద



శ్రీరామకృష్ణ మఠం
మైలాపూర్ :: చెన్నై 600 004

# సర్వతోముఖ వేదాంతం*

చాలాపూర్వం, చరిత్ర రచన కానీ, సాంప్రదాయిక కథల మందకాంతులుకానీ చొరని, పురాణకాలంనుండి ఒక జ్యోతి సుస్థిరంగా వెలుగుతోంది. బాహ్య పరిస్థితుల వల్ల, ఒక్కొక్కప్పుడు, దాని కాంతి తగ్గుతున్నట్లున్నా, ఇతర సమయాల్లో దేదీప్యమానంగా ప్రకాశిస్తూవచ్చింది. అది, ఆరిపోక నిశ్చలమై నిలిచి, తనకాంతులను భారత దేశంలో ప్రసరింపచేయటమే కాక, తన మహిమను ప్రపంచంలోని సర్వ జిజ్ఞాసువుల మనఃక్షేత్రాల్లో నింపింది. ఆ జ్యోతి మన ఉపనిషన్మతమే. నిశ్శబ్దంగా, మెల్లమెల్లగా, ఎవరి కనుల పడకక రాలుతూ, నవనవ కోమలమైన గులాబీపూలను వికసింపజేసే ఉషఃకాలపు మృదుతుషారంలాగా, ఆడంబరంలేక, సుకుమారమైనా సర్వశక్తిమంతమైన ఈ ఉపనిషన్మతం,- అంటే వేదాంతతత్త్వం - ప్రశాంతంగా, ప్రకాశిస్తోంది. ఇది భారతభూమిలో మొదట, ఎప్పుడు అభ్యుదయమందిందో ఎవరికీ తెలీదు. దాన్ని తెలిసికోవడానికి జరిగిన ఊహలన్నీ - ముఖ్యంగా పాశ్చాత్య గ్రంథకర్తలవి - వ్యర్థమైనవి. వారు చేసిన కాలనిర్ణయాలు, చాలా పరస్పర విరుద్ధంగా ఉన్నాయి. కానీ హిందువులమైన మనం, పారమార్థిక దృష్టితోచూసి, దానికి మొదలే లేదంటాం. ఈ ఉపనిష

---

* కలకత్తాలో ఇచ్చిన ఉపన్యాసం

తత్త్వసిద్ధాంతం, ఈ వేదాంతం - మనిషికి, ఆధ్యాత్మిక క్షేత్రంలో, ఇంతవరకు ప్రసాదించబడిన ప్రజ్ఞానరాశిలో, మొట్టమొదటిదీ, చిట్టచివరదీ అని చెప్పడానికి నేను సాహసిస్తున్నాను.

ఈ వేదాంత మహాసముద్రంనుండి ప్రకాశతరంగాలు వెలువడి, మాటిమాటికి తూర్పుదిశకు, పడమటి దిశకు వ్యాపిస్తూ వచ్చాయి. ప్రాచీనకాలంలో ఇవి పడమటి దిశగాపోయి, ఏథెన్సునగరంలోనో, అలగ్జాండ్రియా నగరంలోనో, ఆంటియోక్ నగరంలోనో, గ్రీకుల మనస్సులని ఎదుర్కొని సంచలనం కల్గించాయి. ప్రాచీన గ్రీకులపై మన సాంఖ్యసిద్ధాంత ప్రభావం దీపించి వుండటం స్పష్టం. ఈ సాంఖ్యానికీ, భారతదేశంలోని తక్కిన సిద్ధాంతాలన్నిటికీ, ఉపనిషత్తులే, అంటే వేదాంతమే ఏకైక ప్రమాణం! భారతదేశంలో ఈనాడు మనం చూస్తున్న పరస్పర భిన్నసంప్రదాయాలకూ, పూర్వకాలంలో వున్న వాటికీ ఉపనిషత్తులే, అంటే, వేదాంతమే మూలాధారమై, ఏకైక ప్రమాణంగా వుండేది. నీవు ద్వైతివైనా, అద్వైతివైనా, విశిష్టాద్వైతివైనా, శుద్ధాద్వైతివైనా, లేక మరెలాటి ద్వైతివిగాని, అద్వైతివిగాని, అయినా, లేక మరేపేరు పెట్టుకొన్నా, నీకు ప్రమాణాలు శాస్త్రాలు, వేదాలు, ఈ ఉపనిషత్తులే. భారతదేశంలో ఏ సిద్ధాంతం ఉపనిష త్ప్రమాణాన్ని అంగీకరించదో, అది ఆస్తిక సిద్ధాంతమని పించుకో జాలదు. బౌద్ధ, జైన, సిద్ధాంతాలు, ఉపనిషత్తుల ప్రమాణాన్ని అంగీరించకపోవడం చేతనే, భారత

దేశంనుండి బహిష్కరించబడ్డాయి. ఈ విధంగా- మనకు తెలిసినా, తెలియకున్నా - భారతదేశంలోని అన్ని సంప్రదాయాల్లోనూ ఉపనిషత్తుల ప్రమాణం అంతర్లీనమై ఉంది. హిందూమతమని మనం పేర్కొనే మహావట వృక్షం - దాని మహత్తరమైన, అసంఖ్యాకాలైన శాఖోప శాఖలతో సహా - వేదాంత ప్రభావంతో సర్వత్ర నిండి వుంది. బుద్ధిపూర్వకంగానో, అబుద్ధిపూర్వకంగానో, మనం, వేదాంతాన్నే భావనచేస్తున్నాం. వేదాంతంలోనే జీవిస్తున్నాం. వేదాంతాన్నే శ్వాసిస్తున్నాం. వేదాంతంలోనే మరణిస్తున్నాం. ప్రతి హైందవుడూ, ఇలాగే చేస్తున్నాడు. కాబట్టి భారతదేశంలో, భారత శ్రోతలకు వేదాంత బోధ చేయడం విపరీత చర్యగా కనిపిస్తుంది. ఐనా బోధించవలసింది అదొకటే. ఆ బోధే ఈ కాలంలో అత్యావశ్యకం. ఏలంటే, నేనిప్పటికే చెప్పినట్లు, భారతసంప్రదాయాలన్నీ ఉపనిషత్తులను శిరసావహించవలసిందే. ఐనా, ఈ సంప్రదాయాల్లో పరస్పర వైరుధ్యాలెన్నో వున్నట్లు పైకి కనిపిస్తుంది. అనేక పర్యాయాలు, ప్రాచీన ఋషులు సైతం, ఈ ఉపనిషత్తులలో అంతర్లీనమైవున్న సామరస్యాన్ని అర్థం చేసికోలేకపోయారు. చాలాసార్లు, ఆ ఋషులే తగవులాడుకొన్నారు. అందువల్లే 'భిన్నభావం లేని ఋషులు లేరు-' అనడం ఒక సామెతైపోయింది. కానీ, ద్వైతమైనా, అద్వైతమైనా, విశిష్టాద్వైతమైనా, మరెలాంటి భావాలైనా వున్నా ఉపనిషద్వాక్యాల్లో అంతర్లీనమైవున్న ఈ సామరస్యాన్ని పూర్వంకన్నా చక్కగా, ధ్రువ

పరచవలసిన అవసరమిప్పు డేర్పడింది. ఆ సామరస్యాన్ని ఇప్పుడు, బహిరంగంగా అఖిల ప్రపంచానికి వెల్లడి చేయాలి. ఈ పని భారతదేశంలో ఎంత అవసరమో ఇతరదేశాల్లోకూడ అంతే అవసరం. అలాంటి సామరస్య రూప వ్యాఖ్యానమై ఎవరి జీవితమంతా ఒప్పిందో, ఎవరి బోధకంటే, జీవితం వేయిరెట్లు ఉపనిషత్తులకు సజీవ భాష్యంగా వుండిందో, ఎవరు మానవరూపం ధరించిన ఉపనిషత్తుల సారాంశమో, అలాంటి ఒక మహాపురుషుని పాదసేవ చేసే మహాభాగ్యం, భగవదనుగ్రహంవల్ల నాకు లభించింది. ఆ సమరసభావం నాకొకింత ప్రాప్తించివుం డొచ్చు. దాన్ని ప్రకటించగలనో లేదో, నాకు తెలీదు. కానీ, అదే నా ప్రయత్నం. వేదాంతమతాలు, పరస్పర విరుద్ధం కావనీ, అవన్నీ ఒక దానికొకటి అవసరమనీ, ఒకదాన్నొకటి సార్థకం చేస్తుందనీ ఒకటి, మరొక దానికి సోపానంలాగా అమరివుండి, పరమగమ్యమైన ''తత్త్వ మసి'' లేక అద్వైతభావం చేరేవరకు, నడుపుకొని పోతుం దనీ, విశదం చేయడమే నా జీవితోద్దేశం! పూర్వమొక ప్పుడు కర్మకాండ భారతదేశాన్ని పరిపాలిస్తూ వుండేది. ఆ వేదభాగంలో ఉత్తమాదర్శాలు చాలా కలవనడం నిజమే. మన ఈనాటి నిత్యపూజావిధానం, ఆ కర్మ కాండ సూత్రాలకు అనుగుణంగానే జరుగుతోంది. అలా అయినా, వేదాల కర్మకాండ భారతదేశంనుండి దాదాపుగా అదృశ్యమైంది. మన అనుదిన జీవితంలో ఏ అత్యల్ప భాగమో తప్ప, ఆ కాండయొక్క నియమాలను అనుస

రించడమే లేదు. మన సామాన్యజీవితంలో మనం చాలా వరకు పౌరాణికులమో, తాంత్రికులమో అనుకోవచ్చు. కొన్ని వేదమంత్రాలను ఉపయోగించేటప్పుడు సైతం మన భారతీయ బ్రాహ్మణులు, వాటిని వేదోక్త విధంగా కాక, చాలవరకు తంత్రాల ప్రకారమో, పురాణాల ప్రకారమో ప్రయోగిస్తున్నారు. అలా కావడంచేత, - వేదాల కర్మకాండను అనుకరించే వాళ్లం అనే అర్థంలో - మనం వైదికులం అని చెప్పుకోవడం సమంజసం కాదని నా భావం. కాని, మన మందరం వేదాంతుల మనేమాట యథార్థం. హిందువులమని' చెప్పుకొనే వారినందరినీ, వేదాంతులని పేర్కొనడం యుక్తం. ఆ వైదాంతిక నామం, ద్వైతాద్వైత సంప్రదాయాల వారందరికీ వర్తిస్తుందని ఇంతకుముందే చెప్పాను.

ఇప్పుడు భారతదేశంలోని సంప్రదాయాలన్నీ సామాన్యంగా ద్వైతం, అద్వైతం అనే రెండు గొప్ప తరగతులుగా విభజించబడుతున్నాయి. ఈ సాంప్రదాయికులలో కొందరు, స్వల్పభేదాలకు ప్రాముఖ్యమిచ్చి, వాటి నాధారం చేసికొని, శుద్ధ ద్వైతులమనీ, విశిష్టాద్వైతులమనీ, ఏమేమో క్రొత్త పేర్లను పెట్టుకొంటారు. అవి అంత పాటించతగినవి కావు. విశాల విభాగంలో, వారంతా ద్వైతులో, అద్వైతులో అవుతారు. ఈ కాలంలో కనిపిస్తున్న సంప్రదాయాలలో కొన్ని చాలా క్రొత్తవి, తక్కినవి మిక్కిలి పురాతన సంప్రదాయాల రూపాంతరాలుగా కనిపిస్తున్నాయి. మొదటి తరగతికి నిదర్శనగా,

శ్రీరామానుజాచార్యులవారి జీవితాన్ని, వారి సిద్ధాంతాన్నీ పేర్కొంటాను. రెండవదానికి, శ్రీ శంకరాచార్యులవారిని పేర్కొంటాను.

రామానుజాచార్యులవారు ఆధునిక భారతదేశ ద్వైత వేదాంతులలో ప్రముఖుడు. తక్కిన ద్వైత సాంప్రదాయికులందరూ తమ తమ సంప్రదాయాల నిర్మాణం లోనూ, ఆ నిర్మాణంలోకల కొన్ని అతిసూక్ష్మ విషయా ల్లోనూ, ప్రత్యక్షంగానో, పరోక్షంగానో, శ్రీరామానుజా చార్యులవారినే అనుసరిస్తున్నారు. శ్రీరామానుజాచార్యుల వారిని, వారి సంప్రదాయాన్ని, భారతదేశంలోవున్న ఇతర ద్వైత వైష్ణవ సంప్రదాయాలతో పోల్చిచూస్తే, నిర్మాణంలోనూ, బోధల్లోనూ, పద్ధతుల్లోనూ, ఎంతగా సమాన లక్షణాలు కనిపిస్తాయో చూస్తే మీరు ఆశ్చర్య పోతారు. దక్షిణదేశంలో మధ్వముని అనే మహా గురు వుండేవాడు. ఆయన్ని అనుసరించి మన వంగదేశంలో చైతన్యులవారు మాధ్వుల తత్త్వశాస్త్రాన్ని చేపట్టి, వంగ దేశంలో ప్రచారం చేశారు. దక్షిణదేశంలో విశిష్టాద్వైత శైవులు మొదలైన ఇతర సంప్రదాయాలుకూడ వున్నాయి. దక్షిణ భారతదేశపు కొన్నిభాగాల్లోను, సింహళంలోనూ తప్ప భారతదేశపు ఇతర ప్రాంతాల్లో కనిపించేశైవులు చాల వరకు అద్వైతులు. ఈ అద్వైతేతరులైన శైవులు విష్ణువు స్థానంలో శివుని నిలుపుతారన్న మాటే కానీ, జీవాత్మను గూర్చిన సిద్ధాంతంలో తప్ప, ప్రతి విషయంలోనూ, రామానుజానుచరులే అనాలి. రామానుజాచార్యులవారి

అనుచరులు, జీవుడు, అణురూపుడనీ - నలుసులాగా అతిసూక్ష్మమై ఉండేవాడని చెబుతారు. శంకరాచార్యుల వారి అనుచరులు జీవుడు విభువు, అంటే సర్వ వ్యాపకు డంటారు. ఇలాటి అద్వైత సంప్రదాయాలు ఎన్నో ఉన్నాయి. ప్రాచీనకాలంలో, అలాటి సంప్రదాయాలన నేకం శంకర సంప్రదాయం మ్రింగేసి తనలో జీర్ణం చేసి కొన్నట్లు కనిపిస్తోంది. కొన్ని భాష్యాల్లో, శంకరుని మీద సైతం ఒక్కొక్క బాణం విడువబడటం అప్పుడప్పుడూ కనిపిస్తుంది. అందులో ముఖ్యంగా విజ్ఞాన భిక్షువు తన భాష్యంలో తాను అద్వైతియై వుండీ, శంకరాచార్యులవారి మాయావాదాన్ని ఎగురగొట్టి వేయడానికి ప్రయత్నిం చాడు. ఈ మాయావాదాన్ని విశ్వసించనట్టి కొన్ని అద్వైత సంప్రదాయాలున్నట్లు కన్పిస్తోంది. వారు, శంకరాచార్యులవారిని ప్రచ్ఛన్నబౌద్ధుడని నిందించడానికి కూడ వెనుదీయలేదు. ఈ మాయావాదం, బౌద్ధుల నుండి తీసుకొని, వేదాంత సంప్రదాయంలోకి చొప్పించా రని వారి అభిప్రాయం. అదెలావున్నా, ఈ కాలంలో అద్వైతులంతా శంకరచార్యులవారి ఆధిపత్యాన్నే అంగీక రిస్తున్నారు. శంకరాచార్యులవారు, వారి శిష్యవర్గము భారతదేశంలోని ఉత్తరప్రాంతాల్లో దక్షిణప్రాంతాల్లో కూడ అద్వైతమతాన్ని బోధిస్తూ గొప్పప్రచారం చేశారు. శంకరులవారి ప్రభావం మన వంగదేశంలో, కాశ్మీర్‌లో, పాంచాలంలో అంతగా వ్యాపించలేదు. కాని, దక్షిణదేశం లోని స్మార్తులంతా శంకరాచార్యులవారి అనుచరులే! కాశీ

నగరం కేంద్రంగా ఉత్తర భారతదేశంలోకూడ, అనేక ప్రాంతాల్లో శంకరాచార్యులవారి ప్రభావం చాలాగాఢంగా వ్యాపించింది.

శంకరాచార్యులవారు కానీ, రామానుజాచార్యుల వారు కానీ, తాము సిద్ధాంతస్థాపకులమని చెప్పుకోలేదు. శ్రీరామానుజాచార్యులవారు తాము, బోధాయనుల వారి వ్యాఖ్యానాన్ని అనుసరిస్తున్నట్లు స్పష్టంగా తెలిపారు. ''భగవద్బోధాయనకృతాం, విస్తీర్ణాం, బ్రహ్మసూత్రవృత్తిం, పూర్వాచార్యః, సంచిక్షిపుః, తన్మతానుసారేణ సూత్రాక్షరాణి వ్యాఖ్యాస్యంతే'' (భగవాన్ బోధాయనులవారు రచించిన విపులమైన బ్రహ్మసూత్ర వృత్తిని, పూర్వపు ఆచార్యులు సంగ్రహపరచారు. వారి అభిప్రాయానుసారంగా, సూత్రవాక్యాలను వివరిస్తున్నాను) అని, శ్రీభాష్య మనే తన గ్రంథారంభంలో శ్రీరామానుజాచార్యుల వారు చెప్పారు. వారు దాన్ని చేపట్టి సంక్షిప్తంగా చేశారు. దాన్నే మన మీనాడు చూస్తున్నాం. బోధాయనులవారి వ్యాఖ్యానాన్ని చూచే అవకాశం నామట్టుకు నాకు ఎన్నడూ లభించలేదు. వ్యాససూత్రాలకు బోధాయనుల వారు చేసిన వ్యాఖ్యానాన్ని తప్ప, తక్కిన వ్యాఖ్యానాలన్నిటినీ కీ.శే. స్వామి దయానందసరస్వతి త్రోసివేయ చూచారు. వీలున్నపుడంతా, రామానుజాచార్యులవారిని ఖండిస్తూండిన ఈయనకూడ, ఆ బోధాయన భాష్యాన్ని చూపజాలకపోయారు. నేను భారతదేశ మందంతటా, దానికోసం వెదికాను. ఇంతవరకు, అది నా కళ్లపడలేదు. కానీ, తాను

బోధాయన భాష్యంలోని భావాలను తీసికొంటున్నట్లూ, కొన్ని సందర్భాల్లో అందులోని వాక్యాలనే తాను సంగ్ర హిస్తున్నట్లూ, ఆ భావాలను సంగ్రహించే తన భాష్యం సిద్ధంచేసినట్లూ, శ్రీరామానుజులవారు స్పష్టంగా తెలి పారు. శంకరాచార్యులవారూ అలాంటి పనే చేసినట్లు కనిపిస్తోంది. ప్రాచీన వ్యాఖ్యానాలు ఉదాహరించబడిన స్థలాలు కొన్ని శంకర భాష్యంలోనూ వున్నాయి. శ్రీ శంక రాచార్యులవారి గురువూ, వారి గురువుయొక్క గురువూ అదే సంప్రదాయానికి చెందిన వేదాంతులు కావడమే కాక, కొన్ని విధాల్లో ఈయనకంటె వారు ఆ మతంలో ఎంతో ఎక్కువ చొరవను, సాహసాన్ని చూపినవారు కావడంచేత, ఆయన బోధించినది ఒక స్వనిర్మిత నూత్నమతం కానే కాదనడం స్పష్టం. శ్రీరామానుజాచార్యులవారు, తమ భాష్యాన్ని బోధాయన భాష్యాన్ని ఆధారం చేసికొని రచిం చినట్లే శంకరాచార్యుల వారుకూడ ఒక పూర్వభాష్యాన్ని ఆధారం చేసికొని తమ భాష్యాన్ని రచించి వుంటారు. కానీ, వా రే భాష్యాన్ని అనుసరించినదీ ఇప్పుడు తెలుసు కోవడానికి వీలుకావడం లేదు. మీ రెప్పుడైనా కన్న, విన్న, దర్శనాలన్నీ ఉపనిషత్తుల ప్రమాణం మీద ఆధారపడి వుండేవే. అది శ్రుతి ప్రమాణమని చెప్పినపుడంతా ఉపని షత్తులనే నా అభిప్రాయం. అవి సదా ఉపనిషత్ప్రమాణా లనే ఉదాహరిస్తూండేవి. ఉపనిషత్తుల తర్వాతనే భారత దేశ ఇతర తత్త్వశాస్త్రాలు వస్తున్నాయి. కాని, వాటిలో ఏదీ భారతదేశంలో వ్యాసులవారి తత్త్వశాస్త్రం పొందినంత

ప్రామాణ్యాన్ని పొందలేకపోయింది. ఈ వ్యాసులవారి తత్త్వసిద్ధాంతం సైతం, అంతకుముందున్న కపిలుని సాంఖ్యసిద్ధాంతం పరిణామమే! ఒక్క భారతదేశంలోనివే కాక, ప్రపంచంలోని ప్రతి తత్త్వసిద్ధాంతం, కపిలునికి అపారంగా రుణపడిందే! తత్త్వసిద్ధాంత విషయంలోను, మనశ్శాస్త్ర విషయంలోనూ, భారతదేశచరిత్రలో కపిలుని పేరే అత్యగ్రగణ్యమని చెప్పవచ్చు. కపిలుని ప్రభావం ప్రపంచంలో అన్నిచోట్ల కనిపిస్తోంది. గణుతి కెక్కిన తత్త్వసిద్ధాంతం వెలసిన చోటంతా కపిలుని సిద్ధాంత ప్రభావాన్ని మీరు గుర్తింపజాలుతారు. వేలకొద్దీ సంవత్సరాలు గడచిపోయినా, ఈ మహాత్ముడు కపిలుడు అసదృశ తేజోమూర్తిగా, అద్భుతప్రభావునిగా ఇప్పటికీ నిలిచేవున్నాడు. అతని తత్త్వసిద్ధాంతంలో చాలాభాగాన్ని, అతని మనశ్శాస్త్రాన్ని, భారతదేశంలో - చాలా స్వల్ప భేదాభిప్రాయాలతో - అన్ని సంప్రదాయాలవారు, అంగీకరిస్తున్నారు. మన (వంగ) దేశంలో, మన నైయ్యాయిక దార్శనికులు, భారతీయ తత్త్వశాస్త్రజ్ఞుల ఆమోదాన్ని ఎక్కువగా పొందజాలకపోయారు. వీరు వర్గోపవర్గాది క్షుద్రవిషయాల్లోనూ, అతిక్లిష్టమైన పారిభాషిక భాషను అభ్యసించడంలోనూ, జీవితకాలాన్నంతా వ్యర్థపరచుకొంటూ, తర్కంలోనే మునిగిపోయి, తత్త్వసిద్ధాంతాలను వేదాంతులకు విడిచిపెట్టారు. ఈ నవీనకాలంలో భారతీయ తత్త్వజ్ఞుల లోని అన్ని సంప్రదాయాలవారు, వంగదేశపు నైయ్యాయికుల తర్క పరిభాషనే అవలంబిస్తున్నారు. గదాధర,

జగదీశ, శిరోమణి పేర్లు నదీయా జిల్లాలో (నవద్వీపం ఆ జిల్లాలోనిది) ఎంత ప్రఖ్యాతి చెందివున్నాయో, మళయాళదేశంలోని కొన్ని నగరాల్లోనూ అంతటి ప్రఖ్యాతిని పొందివున్నాయి. కానీ, వేదాంత విషయంలో మాత్రం ''వ్యాససూత్రాలు'' సుస్థిరస్థానాన్ని పొంది, తత్త్వసిద్ధాంతంలోని వేదాంతపక్షం ఏ బ్రహ్మాన్ని గూర్చి మానవులకు బోధిస్తోందో, ఆ బ్రహ్మంలాగానే శాశ్వతంగా వ్యాససూత్రాలుకూడ దేశంలో నాటుకొనిపోయాయి. తర్కం అనేది, శ్రుతిప్రమాణానికి పూర్తిగా తలఒగ్గవలసి వచ్చింది. శ్రీ శంకరాచార్యులవారు ప్రవచించినట్లు వ్యాసుడు తర్కంలో ఏమాత్రమూ దిగలేదు. సూత్రాలను వ్రాయడంలో వారి ముఖ్యోద్దేశం వేదాంత వాక్య ప్రసూనాలను పోగుచేసి, ఒక్క దారంతో హారం కూర్చడమే. ఉపనిషత్తుల ప్రమాణానికి లోబడి ఉన్నంతవరకు మాత్రమే ఆ సూత్రాలు అంగీకరింపబడుతున్నాయి. అంతకుమించిన ప్రామాణికత వాటికి లేదు.

నేను చెబుతున్నట్లు, భారతదేశంలోని అన్ని సంప్రదాయాలవారూ ఈ వ్యాససూత్రాలను పరమప్రమాణంగా అంగీకరిస్తున్నారు. భారతదేశంలోని ప్రతి క్రొత్త సంప్రదాయమూ, తన దృక్పథానుకూలంగా ఈ వ్యాససూత్రాలకు ఒక క్రొత్త వ్యాఖ్యానాన్ని కూర్చడానికి యత్నిస్తుంది. ఈ భాష్యకర్తల మధ్య, భేదాలు ఒక్కొక్కప్పుడు చాలా గొప్పవిగా వుంటాయి. కొన్ని సమయాల్లో వారు శ్రుతి వాక్యాలను తికమకలు చేయడంచూస్తే వెగటుపుడు

తూంటుంది. వ్యాససూత్రాలకు పరమప్రమాణ పదవి సిద్ధించింది. ఎవనికిగాని, వేదాంతసూత్రాల మీద ఒక నూతన భాష్యాన్ని రచించేవరకు, భారతదేశంలో క్రొత్త సంప్రదాయాన్ని నిర్మించే అధికారం కలుగదు.

ఆ తర్వాత ప్రామాణికత భగవద్గీతకుంది. సుప్రసిద్ధమైన శంకరాచార్యులవారి ఘనత అంతా, గీతాప్రచారంలోనే ఉంది. గీతను బోధించడం, దాన్ని గూర్చి ఎంతో అందమైన భాష్యాన్ని వ్రాయడం, ఈ మహాపురుషుడు తన దివ్యజీవితంలో చేసిన అనేక ఘనకార్యాలలోకంతా, ఉత్తమోత్తమ కార్యం. భారతదేశంలో ఆస్తిక సంప్రదాయ నిర్మాతలంతా, ఆ తర్వాత ప్రతివారూ ఒక్కొక్క గీతా భాష్యాన్ని వ్రాశారు.

ఉపనిషత్తులు చాలా వున్నాయి. అవి నూట ఎనిమిదని ప్రతీతి. కానీ ఇంకా ఎన్నో ఉన్నాయని కొందరంటున్నారు. వీటిలో కొన్ని తర్వాతికాలంలో వ్రాసినవనడం స్పష్టం. ఉదాహరణకు అల్లాను స్తోత్రం చేసేది, మహమ్మదును రజసుల్లా అని పేర్కొనేది అయిన, అల్లోపనిషత్తు ఒకటుంది. ఇది హిందువులకు, మహమ్మదీయులకు సఖ్యం కూర్చడానికై అక్బర్ కాలంలో వ్రాయబడిందట! ఎక్కడో సంహితాల్లో ఒకచోట అల్లా శబ్దమో, ఇల్లా శబ్దమో, దొరకగానే పట్టుకొని దాని ఆధారంతో ఒక ఉపనిషత్తును వ్రాశారు. ఈ విధంగా, అల్లోపనిషత్తులో మహమ్మదు ''రజసుల్లా'' అయిపోయాడు. దాని అర్థం ఏమైనా కానివ్వండి. ఇతర సాంప్రదాయకమైన

ఉపనిషత్తులుకూడ ఇలాంటివే ఉన్నాయి. అవి క్రొత్తవని మనం గ్రహించగలం. వేదాలలో సంహితాభాగమందలి భాష అతిప్రాచీనమైంది. ఆ ప్రాచీన భాషకు వ్యాకరణం లేదు. కాబట్టి ఉపనిషత్తులను సృష్టించడం చాలా సులభ మైన పని. కొన్ని సంవత్సరాల క్రిందట వేదభాషయొక్క వ్యాకరణం నేర్చుకోవాలనే భావం నాకు కలిగింది. తర్వాత పట్టుదలతో పాణినీయ వ్యాకరణాన్ని, మహాభాష్యాన్ని చదవడం ప్రారంభించాను వైదిక వ్యాకరణం సూత్రాలకు కల వ్యతిక్రమాలతో నిండివుండటం చూచి ఆశ్చర పడ్డాను. ఒక సూత్రం వుంటుంది. దాని క్రిందనే ఈ సూత్రం వ్యతిక్రమరూపమైంది అనే వ్యాఖ్యానం కనిపి స్తుంది. కాబట్టి ఎవరైనా, దేనినైనా వ్రాయడానికి ఎంత స్వేచ్ఛను పొందారో చూడండి. ఈ స్వేచ్ఛను కొంత నిరోధించేది యాస్కుని నిఘంటు వొక్కటే. కాని, చాల వరకు ఇందులో వుండేవి, అసంఖ్యాకాలైన సమానార్థక పదాలు మాత్రమే. ఈ పరిస్థితుల్లో, మీ కిష్టం వచ్చినన్ని ఉపనిషత్తులను వ్రాయడం ఎంత తేలికో చూడండి. ప్రాచీన వైదిక శబ్దాలలాగా వుండేలా చేయడానికి కావలసిన మాటలను కొంచెం సంస్కృత భాషాజ్ఞానాన్ని సంపాదిం చుకొంటే చాలు. వ్యాకరణ భయం లేదు! కాబట్టి, మీరు రజసుల్లానో మరే ఇతర సుల్లానో ఆవాహనం చేయవచ్చు. ఈ విధంగా, ఉపనిషత్తులు ఎన్నో సృష్టించబడ్డాయి. ఇప్పుడుకూడ, అలాటివి సృష్టించబడుతూనే వున్నా యని నేను విన్నాను. భారతదేశంలో కొన్ని ప్రాంతాల్లో

వేర్వేరు తెగలవారు అలాటి ఉపనిషత్తులను సృష్టిస్తున్నా రని నాకు బాగా తెలుసు. అయినా, కొన్ని ఉపనిషత్తులలో చూసినంత మాత్రంతోనే సత్యసిద్ధమని తెలిపే గుర్తులు న్నాయి. ఇలాటి వాటిని మహాభాష్యకర్తలు, అందు లోనూ ముఖ్యంగా శంకరులు, ఆ తర్వాత రామానుజులు మొదలైన ఆచార్యపురుషులు తీసికొని వాటిపై వ్యాఖ్యానా లను వ్రాశారు.

ఉపనిషత్తులను గూర్చి మీకు నేను తెలుపదలచిన ఒకటి రెండు భావాలున్నాయి. అవి ఒక జ్ఞానమహాస ముద్రం కాబట్టి, వాటినిగూర్చి మాట్లాడటానికి, నా వంటి అల్పజ్ఞునకు ఏండ్లు పూండ్లు పడతాయి. ఎన్నో ఉపన్యాసాలీయవలసి వుంటుంది. అందుచేత, వాటిని చదివేవాళ్లు తెలుసుకోవలసిన ఒకటి రెండు విషయాలు మాత్రం మీకు చెబుతాను. మొట్టమొదటిది: ప్రపంచం లోకంతా, అవి అత్యద్భుతమైన కావ్యాలు. మీరు వేదాల లోని సంహితాభాగాన్ని చదివితే అప్పుడప్పుడు అత్యా ద్భుతమైన రమణీయవాక్యాలు మీకు గోచరిస్తాయి. ఉదాహరణకు- ''తమ ఆసీత్తమసాగూఢ మగ్రే'' ''చీకటి చీకటిలో మాటువడినప్పుడు'' మొదలైన 'అవ్యక్త' వర్ణ నగల సుప్రసిద్ధ శ్లోకమొకటి వుంది. ఆ కవిత్వాన్ని చది వితే, అందలి ఉదాత్తత అనుభవానికి వస్తుంది. భారత దేశంలోను, ఇతరదేశాల్లోనుకూడ సుందరమైన దానిని వర్ణించే ప్రయత్నాలు జరిగాయని మీరు గుర్తుంచుకోండి. కాని ఆ అన్యదేశీయులెప్పుడూ కండరాల్లోను, దృశ్యా

ప్రపంచంలోను, జడపదార్థంలోను, ఆకాశంలోను, అఖం డత్వాన్ని కనుగొనడానికే యత్నించారు. మిల్టన్‌గాని, డాంటేగాని, లేక ఏ పాశ్చాత్య కవిశ్రేష్ఠుడుగాని, ప్రాచీను డైనా, ఆధునికుడైనా, అఖండతత్వ స్వరూపాన్ని చిత్రించ కోరుతున్నప్పుడు వెలుపలికి ఎగిరి పోజూస్తాడు. ఉపాధి మూలంగా, అఖండతత్వాన్ని నీ అనుభవానికి తీసికొనిరా ప్రయత్నిస్తాడు. 'లాటి ప్రయత్నం ఇక్కడకూడ జరి గింది. సంహితలో అఖండవ్యాప్తి కళ్లకు కట్టినట్లు, అద్భుతంగా ప్రదర్శించబడింది. ఇంకెక్కడా, అంత అద్భుత చిత్రణ కనిపించదు. ''తమ ఆసీత్తమసా గూఢమ్'' అనే పై వాక్యాన్ని గుర్తుంచుకొని చీకటిని గూర్చి ముగ్గురు కవులు చేసిన వర్ణనలను పరిశీలించండి. మన కాళిదాసు ''సూచీభేద్యైస్తమోభిః'' (సూదిమొనతో గ్రుచ్చగల తమస్సు) అని వర్ణించాడు. ఇక మిల్టన్ ''కాంతికాదు, రూపం దాల్చిన అంధకారం'' అని వర్ణిం చాడు. ఇక ఉపనిషత్తులోని వర్ణన చూడండి. ''చీకటి, చీకటిని ఆవరించింది'' లేక ''చీకటి, చీకటిలో దాగింది''. ఉష్ణదేశాల్లో నివసించే మన కిది అర్థం కాగ లదు. ఆకస్మికంగా, వర్షాగమన మవుతుంది. కారు మబ్బులు ఆకసమంతటా అలముకొంటాయి. ఇంకా, ఎక్కడినుండో దొర్లుకొనివచ్చే నల్లనిమేఘాలచే ఆవరించ బడి, ఒక్క క్షణంలో దిఙ్మండలంలో చీకట్లు క్రమ్ముకుం టాయి. సంహితాభాగంలోని ఈ వర్ణనలన్నీ దృశ్యప్రపం చానికి సంబంధించినవే. ఇతర దేశాల్లో లాగే, ఇక్కడా ఈ

జీవిత మహాసమస్య పరిష్కార ప్రయత్నాలు బాహ్య ప్రపంచం ద్వారా జరిగాయి. జిజ్ఞాసువులగు గ్రీకులు, ఇప్పటి యూరోపియనులు, "జీవం" "పురుషుడు" మొదలైన అనేక పవిత్ర సమస్యలన్నిటికీ, బాహ్యప్రపంచం లోనే పరిష్కారాన్ని అన్వేషించాలని యత్నించారు. మన పూర్వులు అలాగే చేశారు: వారుకూడ యూరోపియన్‌ల లాగే విఫలులయ్యారు. కాని, పాశ్చాత్యులు ఇంకే ప్రయత్నమూ చేయక, అక్కడే నిలిచిపోయారు. ఈ జనన మరణ మహాసమస్యల పరిష్కారం కోసం, బాహ్యప్రపంచంలోనే వెదకసాగారు. బురదలో దిగబడినట్లు అక్కడే ఆగిపోయారు. మన పూర్వులుకూడ, అది అసాధ్యమని తెలిసికొన్నారు. కానీ ఆ పరిష్కారాన్ని తెలిసికోవడానికి ఈ ఇంద్రియాలు ఎంతమాత్రమూ సమర్థం కావని, ధైర్యంతో ప్రకటించారు ఈ నిర్ణయం ఉపనిషత్తులో కంటే మిన్నగా మరెక్కడా ప్రకటించబడలేదు. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" (దేన్ని చేరజాలక మనస్సుతో సహా వాక్కు వెనక్కి మరలివస్తుందో) "న తత్ర చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి" (ఈ నేత్రాలు అక్కడికి పోజాలవు. వాక్కుకూడ చేరజాలదు.) ఈ విధంగా ఇంద్రియాలు బొత్తిగా అసమర్థమని ప్రకటించే వాక్యాల నేకమున్నాయి. కానీ, వారంతటితో ఆగక, మనిషి లోపలి ప్రకృతి మీదికి దృష్టిని మరల్చి, తమ ఆత్మవల్ల సమస్యా పరిష్కారం సాధించడానికి యత్నించారు. అంటే, బాహ్య ప్రకృతిలో ఏమి చేయడానికి వీల్లేకపోవడంచేత, ప్రత్యు

త్తరంగాని, ఆశగాని, దొరక్కపోవడంచేత వారు దృశ్య ప్రకృతిని పూర్తిగా వదలివేశారు. ఈ మూఢమైన నిర్జీవ పదార్థం సత్యాన్ని తెలుపజాలదని వారు గ్రహించారు. అంతట, నరునిలోని దివ్యాత్మ దగ్గరికి మరలిపోయి, అక్కడ సమస్యాపరిష్కారాన్ని కనుగొన్నారు.

'తమేవైకం జానథ, ఆత్మానం, అన్యా వాచో విముంచథ -'' (ఈ ఆత్మను మాత్రమే' తెలిసికోండి. ఇతరమంతా వ్యర్థప్రసంగం. అది చేయకండి, వినకండి) అని వారు ఘోషిస్తున్నారు. ఆత్మలో వారికి సంశయ పరిష్కారం చిక్కింది. అందులోనే అన్ని ఆత్మలకు పరమాత్మ, దేవుడు, జగదీశ్వరుడు; నరుని ఆత్మతో వానికిగల సంబంధం; మనం వానిపట్ల నిర్వర్తించవలసిన ధర్మం; తద్వారా పరస్పరం మనలో మనకు ఏర్పడే సంబంధం; ఇవన్నీ వారికి విశదమయ్యాయి. ఈ సంద ర్భంలోనే ప్రపంచంలోకల కవిత్వంలో మనోహరతమ మైంది వుంది. జడప్రపంచపు భాషలో ఈ ఆత్మను వర్ణించే ప్రయత్నం ఇంక వారు చేయలేదు. ఇంతేల. వారు, ఆ వర్ణనలో ప్రత్యక్షరూపమైన భాషనే విసర్జించి వేశారు. ఇంద్రియాలకు అఖండబ్రహ్మమును గురించిన భావాన్ని కలిగించడానికై ఆ ఇంద్రియాల దగ్గరికి వారిక దిగిరాలేదు. దృశ్యమానం, జడం, నిర్జీవం, పంచభూత మయం, ఇంద్రియగమ్యం, విశాలం అయిన అనంత లోకం మళ్లీ అందులో కనిపించదు. దానికి మారుగా,

మరొకటి వస్తుంది. ఈ క్రింది మనోహరవర్ణనను అందు కుదాహరణగా తీసుకోండి.

''న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం
నేమా విద్యుతో భాన్తికుతోఽయమగ్నిః
తమేవ భాంతమనుభాతి సర్వం తస్య
భాసా సర్వమిదం విభాతి.-''

ఆహా! ప్రపంచంలో దీన్ని మించిన ఉదాత్త కవిత్వం ఏది? (అక్కడ సూర్యుడు ప్రకాశింపజాలడు. చంద్రుడు, నక్షత్రాలు ప్రకాశింపజాలవు. మెరపు సైతం ప్రకాశింపజాలదు. ఇక అగ్నిమాట చెప్పనేల?) ఆహా! లోకంలో ఇంతకంటె మహోదాత్తమైన కవిత్వం ఉండ గలదా? ఉపనిషత్తులలో కెల్లా అత్యద్భుతమైన కఠోపని షత్తును తీసికోండి. ఎటువంటి అద్భుత నైపుణ్యం, ఎటువంటి విచిత్ర కళాసంపత్తి ఆ కావ్యంలో గోచరి స్తోంది? దాని ప్రారంభమే ఆశ్చర్యం కలిగిస్తోంది. శ్రద్ధ చేత ఆవహించబడిన లేబ్రాయపు కుర్రవాడు యముని చూడగోరుతాడు. గురువుల్లో కెల్లా చాలా చిత్రమూర్తి అయిన మృత్యుదేవతే జననమరణాలను గూర్చిన మహారహస్యాలను ఆ పిల్లవానికి బోధించడం జరిగింది. ఆ పిల్లవాని అన్వేషణలోని లక్ష్యమేది? మృత్యురహస్యాన్ని కనుగొనడం!

మీరు జ్ఞాపకముంచుకోవాలని నేను కోరే రెండవ విషయమది. ఉపనిషత్తుల ప్రామాణికత మానవులపై ఆధారపడనే పడదు. వాటిలో అనేక పురుషులు, అనేక

వక్తలు, అనేక గురువులు ఉదాహరించబడివుండటం నిజమే కానీ, వారిలో ఒక్కడైనా, ఈ ఉపనిషత్తులకు ఆధారభూతుడు కాడు. ఒక్క శ్లోకమైనా వారిలో ఒకని జీవితంపై ఆధారపడివుండలేదు. వీరందరూ ఎక్కడో వెనుక మెదలుతూంటారు; వారి నీడలు మాత్రం, తెర మీద కనిపిస్తూందా అన్నట్లుంటాయి. వాళ్ల పట్టుకోవ డానికి చిక్కరు చూపులకు దొరకరు. ఇలాటి వారని విస్పష్టంగా గోచరించరు. ఉపనిషత్తులు ఎవరిమీదా ఆధారపడినవి కానే కావు. వాటి బలమంతా, అందులోని అత్యద్భుతాలు, దేదీప్యమానాలు, జ్ఞాన తేజోమయాలు అయిన వాక్యాల్లోనే వుంది; రచయితల మీద కాదు. యాజ్ఞవల్క్యులు ఇరవైమంది పుట్టనీ, జీవించనీ, మర ణించనీ, లెక్కలేదు. లెక్కకు వచ్చేవి శ్రుతివాక్యాలే. శ్రుతివాక్యాలు వ్యక్తులపై ఆధారపడనివి; కాని, అవి ఏ వ్యక్తులను ఖండించవుకూడ. ప్రపంచంలో ఇదివరకు ఉద్భవించినట్టి, ఇంక ఉద్భవించనున్నటి వ్యక్తుల నంద రినీ, తన కౌగిట చేర్చుకోజాలేంతటి విశాలత, ఆదరణ, అందులో వుంది. నరులను, అవతారులను, ఋషిశ్రేష్ఠు లను పూజించడానికి అది అడ్డు చెప్పదు. పైగా అట్టిదాన్ని సదా సమర్థిస్తుంది. కాని దానికి మానవులతో సంబంధం లేదు. ఉపనిషత్తులు ప్రతిపాదించే ఈశ్వరునికి, అంటే, నిర్గుణునికి పురుషభావం ఎలా లేదో, అలాగే, అందు లోని వాక్యాలకు పురుషాధారం, పురుషసంబంధం లేకుం డటం అద్భుతమైన విషయం. ఆధునిక భౌతికశాస్త్ర

జ్ఞుడు సత్యమెంత అనన్యాధారమై వుండగోరుతుందో, అంత స్వయం ప్రామాణికతతో ఈ ఉపనిషత్సూత్రాలు, జ్ఞానసిద్ధులకు, జిజ్ఞాసువులకు, తత్త్వజ్ఞులకు, తార్కికు లకు గోచరిస్తాయి. ఇవే మన ప్రమాణ గ్రంథాలు. క్రైస్త వులకు బైబిల్ ఎలాంటిదో, మహమ్మదీయులకు ఖురాన్ ఎలాంటిదో, బౌద్ధులకు త్రిపిటకం ఎలాటిదో, పారశీకు లకు జండవెస్టా ఎలాటిదో, మనకు ఉపనిషత్తులు అలాటివని మీరు జ్ఞాపకం వుంచుకోవాలి. పురాణాలు, తంత్రాలు, మొదలైన గ్రంథాలన్నీ చివరకు వ్యాససూ త్రాలు సైతం, ద్వితీయ, తృతీయశ్రేణికి చెందిన ప్రమా ణాలే. మొట్టమొదటి శ్రేణికి చెందిన ప్రమాణాలు వేదాలు. మనుధర్మశాస్త్రంకానీ, పురాణాలుకానీ, మరి ఏ ఇతర గ్రంథాలుకానీ, ఉపనిషత్తులకు అనుకూలంగా ఉండేంతవరకే పరిగ్రాహ్యాలు. ప్రతికూలమైనప్పుడు నిర్దాక్షిణ్యంగా వాటిని త్రోసివేయవలసిందే. ఈ విషయం ఎప్పుడూ మన జ్ఞప్తిలో వుంచుకోతగింది. కానీ, దుర దృష్టంవల్ల భారతదేశం ఈ కాలంలో ఆ మాట మరిచి పోయింది. ఏ అల్ప గ్రామాచారమో, మన కిప్పుడు యథార్థమైన ప్రమాణంగా కనిపిస్తోంది. ఉపనిషత్తుల బోధ అలా కనిపించడం లేదు. వంగదేశంలో ఏ మారు మూల గ్రామంలోనో వాడుకలో వుండే స్వల్పాభిప్రాయం వేదవాక్యమంతటి అధికారం కలదిగా, అంతకంటె అధిక మైందిగాకూడ పరిగణించబడుతోంది. 'పూర్వాచార' మనే శబ్దానికి ఎంత విచిత్రమహిమ వుందో చూడండి.

గ్రామవాసికి కర్మకాండలోని అత్యల్పాంశ మొక్కటి అత్యధిక గౌరవాస్పదమైన సదాచారంగా కనిపిస్తోంది. దాన్ని అనుసరించని వానిని ''పో, నీ వింక హిందువుడవు కావు'' అని నెట్టేస్తారు. అట్లే, ఏదో ఒక తంత్రాన్నిచేపట్టి, ''ఈ తాంత్రికాచారాన్ని అనుసరించి తీరాలి'' అనే వారు దురదృష్టవశాత్తు నా మాతృభూమిలో అసంఖ్యాకంగా వున్నారు. వారి అభిప్రాయంలో అలా చేయనివాడు సదా చారి కాడు. కాబట్టి ఉపనిషత్తులలోనే ప్రధానప్రామాణ్యం వుందనీ, గృహ్యాసూత్రాలకు, శ్రౌతసూత్రాలకు సైతం, వేదాలకంటే తక్కువ ప్రామాణ్యమే వుందనీ, జ్ఞప్తిలో వుంచుకోవడం మనకు ముఖ్యం. అవి మన పూర్వులైన మహాఋషుల వాక్కులు. నీవు హిందువు కాగోరితే వాటిని విశ్వసించాలి. భగవంతునిగూర్చి నీకు ఏవేవో స్వతంత్రభావా లుండవచ్చు. కానీ వేదాలు ప్రమాణం కావంటే నీవు నాస్తికుడివే. క్రైస్తవుల, బౌద్ధుల మతగ్రంథా లకు, మన మతగ్రంథాలకు భేదం ఇక్కడే వుంది. వారి శాస్త్రాలన్నీ పురాణాలేకానీ, శాస్త్రగ్రంథాలు కావు. ఎందు కంటే వాటిలో జలప్రళయ కథనం, రాజవంశ చరిత్రలు, రాజ జీవితాలు, మహాపురుషుల జీవితాలు, ఇలాంటి వెన్నో వర్ణించబడ్డాయి. ఇది పురాణ లక్షణం. అవి వేదా లకు అనుగుణంగా వున్నంతవరకు మంచివే; బైబిలు, ఇతర జాతుల ధర్మగ్రంథాలుకూడ, వేదాలను అనుస రించినంతవరకు పూర్తిగా యోగ్యమైనవే; వ్యతిరేకంగా ఉన్నప్పుడు గ్రాహ్యం కాజాలవు. ఖురాన్ విషయంకూడ

అంతే. దానిలో నీతిబోధలెన్నో వున్నాయి. అవి వేదాలకు అనుగుణంగా వుండేంతవరకు వాటికి పురాణాలతో సమానమైన ప్రామాణికత సిద్ధిస్తుంది. అంతకుమించిన గౌరవం లేదు. మన వేదాలు అపౌరుషేయాలనీ, వాటికి ఆదిలేదనీ హిందూమతభావం. ఒక క్రైస్తవ మతప్రచారకుడు, తమ మత గ్రంథాలు చారిత్రక లక్షణాలు కలవి కాబట్టి, అవి సత్యాలని ఒకప్పుడు నాతో చెప్పాడు. అందుకు నేనిలా ప్రత్యుత్తర మిచ్చాను. ''మా శాస్త్రాలకు చారిత్రక లక్షణాలు లేవు. అందువల్లే అవి సత్యం. మీవి చారిత్రాత్మకాలు కాబట్టి, ఎవడో ఒకడు ఇటీవల వాటిని వ్రాసివుంటాడు. మీవి మానవనిర్మితాలు; మావో, అట్టివి కావు. నా వానికి చారిత్రక లక్షణం లేకపోవడమే వానికి వన్నె తెస్తోంది.'' ఇదే వేదాలకు, ఈనాడు ప్రపంచంలోవున్న ఇతర మతగ్రంథాల కన్నిటికీకల తారతమ్యం!

ఇక ఉపనిషత్తుల బోధనలను విచారిద్దాం. భిన్న భిన్నమైన వాక్యాలు వాటిలో వున్నాయి. అందులో కొన్ని పూర్తిగా ద్వైతపరమైనవి. మరికొన్ని అద్వైతపరం. అయినా, భారతదేశంలో వున్న వివిధ శాఖా సంప్రదాయాల వారందరిచేత, అంగీకరించబడిన సిద్ధాంతాలు కొన్ని ఉన్నాయి. ఒకటి సంసారాన్ని గూర్చిన, అంటే - జీవుని జన్మాంతరాన్ని గూర్చిన సిద్ధాంతం. రెండోది మానసికశాస్త్ర విషయంలో ఏకీభావం. మొదట భౌతిక శరీరమొకటి ఉంటుంది. దానిలోపల సూక్ష్మశరీర మనబడే

మనస్సుంది. దానికి లోపల జీవుడుంటాడు. పాశ్చాత్యుల మానసిక శాస్త్రానికీ, భారతీయుల మానసిక శాస్త్రానికీ, ఇదే ముఖ్యభేదం. పాశ్చాత్య మనస్తత్వశాస్త్రం దృష్టిలో మనస్సే ఆత్మ. ఇక్కడో - అలా కాదు. అంతఃకరణం (లోపల వుండే ఉపకరణం) అనబడే మనస్సు జీవుని స్వాధీనంలో వుండే ఒక పనిముట్టు మాత్రమే. దీని సహాయంతో జీవుడు శరీరం మీద, బాహ్యప్రపంచం మీద, పనిచేస్తాడు. ఈ విషయంలో అందరికీ ఏకాభిప్రాయముంది. ''ఈ జీవుడు లేక ఆత్మ (లేక జీవాత్మ అని కొన్ని సంప్రదాయాల వారు పిలుస్తున్నది) ఆది లేనిదనీ, నిత్యమనీ అది, చివరికి మోక్షాన్ని పొందేవరకు జన్మ పరంపరలను పొందుతూ, సాగిపోతుంది -'' అని అందరూ అంగీకరిస్తున్నారు. ఇంకొక విషయంలోకూడ వీరంతా ఏకీభవిస్తున్నారు. పాశ్చాత్య సిద్ధాంతాలకు, భారతీయ సిద్ధాంతానికీ మధ్య వున్న ప్రాణప్రాయమైన భేదాన్ని అత్యంత స్పష్టంగా, అత్యంత ప్రధానంగా ఇదే గుర్తింపజేస్తుంది. సర్వమూ, ఆత్మలోనే వుందనే సిద్ధాంతమే ఇది. ఎక్కడో వెలుపలి నుండి వచ్చే దేదీ లేదు. నిజానికి అంతా లోపలినుండి వెలికివచ్చేదే. సకల శక్తులూ, సర్వపవిత్రత, సమస్త మహనీయత ఆత్మలోనే వున్నాయి. యోగి పొందగోరే అణిమ, లఘిమ, గరిమ మొదలైన అష్టసిద్ధులు, నిజానికి ''సంపాదించబడేవి'' కావనీ, అవి ఇదివరకే ఆత్మలో వున్నవి కాబట్టి వాటిని వ్యక్తరూపానికి తేవడానికే తాను ప్రయత్నిస్తున్నాననీ యోగి చెబుతాడు. మీ పాదాల క్రింద ప్రాకులాడే

అత్యల్ప క్రిమిలోకూడ ఈ ఎనిమిది విధాలైన యోగ సిద్ధులు ఇదివరకే ఉన్నాయని పతంజలి చెబుతున్నాడు. భేదమంతా, శరీరం వల్ల, అంటే, ఉపాధివల్ల కల్పితమవు తోంది. ఆ క్రిమి ఉత్తమతర శరీరాన్ని పొందిన వెంటనే ఈ మహిమలు వ్యక్తమవుతాయి. అంతే; అవి అక్కడ వున్నవే. ''నిమిత్త మప్రయోజకం ప్రకృతీనాం వరణ భేదస్తు తతః క్షేత్రికవత్'' (సత్కార్యాలుగానీ, దుష్కార్యా లుకానీ, స్వభావ పరివర్తనకు ప్రత్యక్ష కారణాలు కావు. కానీ, అవి ప్రకృతి పరిణామానికి అడ్డుపడే ఆటంకాలను ఛేదించడానికి మాత్రమే పనికొస్తాయి. - సేద్యగాడు ప్రవాహమార్గంలోని అడ్డాలను తీసివేయగానే, నీరు తన స్వభావంచేతనే ప్రవహించే విధంగా) ఎక్కడోవున్న మహాతటాకంనుండి, తన పొలంలోకి నీరు పారించు కొనే సేద్యగాని సుప్రసిద్ధ ఉదాహరణాన్ని ఈ సందర్భంలో పతంజలి ఇస్తున్నాడు. తటాకం ఇదివరకే నీటితో నిండి వుంది. ఒక్క క్షణంలో అది అతని పొలాన్ని నింపేసేదే. కానీ పొలానికీ, తటాకానికీ, ఒక పెద్దకట్ట అడ్డముంది. ఈ అడ్డాన్ని తొలగించగానే ఆ నీరు స్వశక్తిచేత, స్వబలం చేత పరుగెత్తి వస్తుంది. ఈ ప్రబల శక్తి, పవిత్రత, పూర్ణత, ఇదివరకే ఆత్మలో వున్నాయి. ఉన్న అవరోధమంతా దానిపై కప్పివున్న ముసుగును పోలిన ఈ ఆవరణమే. ఎప్పుడు, ఈ ముసుగు తొలగిపోతుందో, అప్పుడే ఆత్మ పవిత్రతను పొందుతుంది; దాని మహిమలన్నీ వ్యక్తరూపం పొందు తాయి. పాశ్చాత్య భావానికీ, ప్రాచ్య భావానికీవున్న గొప్ప

భేదమిదే అని మీరు జ్ఞప్తిపెట్టుకోవాలి. ఈ భావభేదం వల్లనే ''మానవులు ఆజన్మ పాపులు'' మొదలైన విపరీత సిద్ధాంతాలను బోధించటం, అలాటి విపరీత సిద్ధాంతాలను నమ్మని మనలాంటి వాళ్లను దుర్మార్గులనడం జరుగుతోంది. మనం స్వాభావికంగానే దుర్మార్గులమైతే మనమింకెప్పుడూ యోగ్యులం కాజాలమని వారు నిదానించి ఆలోచించరు. - స్వభావం మారజాలదు కదా? మారితే దాన్ని స్వభావమనడంలో భావవైరుధ్యం వుంటుంది - మారేది స్వభావం కాజాలదు. మనం దీన్ని జ్ఞాపకముంచుకోవాలి. ఈ విషయంలో ద్వైతులు, అద్వైతులు, భారత దేశంలోని తక్కిన వారంతా, ఏకాభిప్రాయులుగా వున్నారు.

భారతదేశంలో అన్ని సంప్రదాయాలవాళ్లు విశ్వసించే మరో విషయం, దేవుడున్నాడనడం. దేవునిగూర్చి వారి భావాలు భిన్నమనడం నిజమే. ద్వైతులు సగుణ బ్రహ్మమును - సగుణబ్రహ్మన్నే - విశ్వసిస్తారు. సగుణుడు అనే మాట అర్థాన్ని మీరింకా కొంచెం వివరంగా తెలిసికోవాలి. భగవంతునికి ఒక శరీరం వుందనీ, అతడు ఎక్కడో, ఒక సింహాసనం మీద కూర్చుని, ఈ ప్రపంచాన్ని ఏలుతూ వుంటాడనీ, ఆ మాటకు అర్థం కాదు. సగుణుడు అంటే గుణాలతో కూడుకొన్నవాడనే అర్థం. సగుణ దైవతం వర్ణనలు అనేకం వున్నాయి. ఈ జగత్తు పరిపాలకుడుగా, సృష్టికర్తగా, రక్షకుడుగా, లయకర్తగా ఉండే ఈ సగుణ దైవతాన్ని అన్ని సంప్రదాయాల వారూ నమ్ముతారు. కానీ అద్వైతులు మరికొంతకూడ

నమ్ముతారు. గుణ నిరూపణం పొసగని చోట, ఏ విశే షణమూ పనికిరాదు. ఈ సగుణదైవతానికి ఒక ఉన్నత దశ వున్నదనీ, అందది సగుణ నిర్గుణమై భాసిస్తుందనీ వారి నమ్మకం. విశేషాలులేని వానిని వర్ణించే విశేషణాలు ఎలా వుంటాయి? కాబట్టి అద్వైతి భగవంతునికి సత్తు, చిత్తు, ఆనందం అనే మూటిని తప్ప ఏ గుణాలను ఆరో పించడు. అఖండ సచ్చిదానందమనే అద్వైతి భగవంతుని వర్ణిస్తాడు. శంకరాచార్యులవారు చేసిందిదే. కానీ ఉపనిష త్తులింకా లోతునకు దిగి, ఆ బ్రహ్మమును గూర్చి ''నేతి, నేతి'' - అంటే ''ఇది కాదు, ఇది కాదు'' అనడం తప్ప ఇంకేమీ వివరించడానికి వీలుకాదని చెబుతున్నాయి.

భారతదేశంలోని భిన్న సంప్రదాయాలన్నీ ఈ అంశంలో ఏకీభవిస్తున్నాయి. కానీ, ద్వైతపక్షాన్ని గూర్చి మాట్లాడేటప్పుడు, ద్వైత సిద్ధాంతాలకు, ఆధునిక మ ; ప్రతినిధి అయిన శ్రీరామానుజాచార్యులవారిని భారతదేశంలోని ద్వైతులకు ఆదర్శమూర్తిగా భావించి మాట్లాడుతాను. ఈ భారతదేశంలో ఇతర ప్రాంతాల్లో పుట్టిన మహామతకర్తలను గూర్చి వంగదేశంలోని మన ప్రజలకు తెలిసింది చాలాతక్కువ. ఇది మిక్కిలి శోచ నీయం. మహమ్మదీయయుగంలో ఒక్క మన చైతన్యుల వారు తప్ప, తక్కిన గొప్ప మతకర్తలంతా దక్షిణభారత దేశంలోనే జన్మించారు. దక్షిణ భారతదేశపు మేధా బలమే ఇప్పుడు నిజంగాభారతదేశాన్ని పరిపాలిస్తోంది. ఏలంటారా? చైతన్యులవారు సైతం అక్కడి సంప్రదాయా

లలో ఒకటైన, మధ్వ సంప్రదాయంలోని ఒక శాఖకు చెందినవారే! రామానుజాచార్యులవారి సిద్ధాంతా న్ననుస రించి, దేవుడు, జీవుడు, ప్రకృతి అనే మూడూ శాశ్వత మైనవి. జీవులు నిత్యులు; సర్వకాలము వ్యక్తిస్వరూపులై శాశ్వతంగా వుంటారు. వారి వ్యక్తిత్వ మెప్పటికీ అట్లే నిలిచి వుంటుంది. మీ ఆత్మ శాశ్వతకాలం నా ఆత్మనుండి వేరుగానే వుంటుందని, రామానుజాచార్యుల వారంటు న్నారు. ఆత్మ వుందనటం, భగవంతుడున్నాడనటం, ఎలా యథార్థమో ఈ ప్రకృతి శాశ్వతమై వుంటుందనడం అలా యథార్థమే. ప్రకృతికూడ శాశ్వతంగా, వేరుపడే నిలిచివుం టుంది. భగవంతుడు సర్వాంతర్గతుడు, జీవాత్మకు సార భూతుడైనవాడు; అతడు అంతర్యామి. ఈ అర్థంలో భగ వంతుడు ఆత్మతో ఐక్యమై వుంటాడనీ, ఆత్మకు మూల సత్త్వమనీ, ఒక్కొక్కప్పుడు రామానుజులవారు భావిస్తు న్నారు. ప్రళయకాలంలో ప్రకృతి అంతా ''సంకుచిత'' మైనప్పుడు ఈ ఆత్మలన్నీ సంకోచంపొంది - అంటే ముడుచుకొని నలుసులలాగా ఏర్పడి, అలాగే కొంతకాలం నిలిచివుంటాయని అతని అభిప్రాయం. తర్వాత కల్పారం భంలో ఈ ఆత్మలన్నీ తమ తమ పూర్వకర్మానుసారంగా వెలువడివచ్చి ఆ కర్మఫలాన్ని అనుభవిస్తూంటాయి. ఆత్మ యొక్క సహజమైన అమలత్వాన్ని, పూర్ణత్వాన్ని, సంకోచ పరచే ప్రతికార్యమూ పాపకార్యమనీ, ఆ ఆత్మను వెలికి తీసి, వికసింపజేసే ప్రతికర్మ, పుణ్యకార్యమనీ, శ్రీరామా నుజాచార్యులవారు చెబుతున్నారు. ఆత్మవికాసానికి

తోడ్పడే ప్రతికార్యం ధర్మం. దాన్ని సంకోచింపజేసే దంతా అధర్మం. ఇలా, ఆత్మ తన కర్మలచేత వికాసాన్ని, సంకోచాన్ని పొందుతూ, పోయిపోయి, భగవదనుగ్రహం వల్ల చివరికి మోక్షాన్ని పొందును. ఇటువంటి అనుగ్రహం కోసం నిష్కళంకంగా తీవ్రప్రయత్నం చేసే, అన్ని ఆత్మ లకూ, ఆ భగవదనుగ్రహం లభిస్తుందని శ్రీరామానుజా చార్యులవారు చెబుతున్నారు

''ఆహారశుద్ధౌ, సత్త్వశుద్ధిః సత్వశుద్ధౌ ధ్రువా స్మృతిః'' అనే ప్రసిద్ధవాక్యం శ్రుతిలో వుంది - ఆహారం శుద్ధంగా వున్నప్పుడు, సత్త్వం శుద్ధమవుతుంది. సత్త్వం శుద్ధ మైనప్పుడు స్మృతి శుద్ధమవుతుంది. స్మృతి అంటే ''ఈశ్వర జ్ఞప్తి''; నీవు అద్వైతి వయితే ''మన పరి పూర్ణతయొక్క జ్ఞప్తి'' అని అర్థం చెప్పుకోవచ్చు. సత్త్వం శుద్ధంగా వున్నప్పుడు, ఈ స్మృతి సత్యతరం, స్థిరతరం, అవ్యయం అవుతుంది. ఇది, ఒక మహావివాద ఘట్టం. మొట్టమొదట ప్రశ్న ''సత్త్వం'' అంటే ఏమి? శరీరం మూడు విధాలైన పదార్థాల కలయికవల్ల ఏర్పడుతోంది - గుణాలచేత కాదు. ఇది సాంఖ్యసిద్ధాంతం; దీన్ని మన తత్త్వసాంప్రదాయికులంతా అంగీకరిస్తున్నారు. సత్త్వం, రజస్సు, తమస్సు అనేవి గుణాలని, సామాన్యంగా అభి ప్రాయపడుతున్నారు. అలా కాదు అవి ఎంతమాత్రమూ గుణాలు కావు. అవి, ఈ జగత్తుగా ఏర్పడిన ద్రవ్యాలే! ఆహారశుద్ధితో, అంటే, ఆహారం పరిశుభ్రంగా వుంటే, సత్త్వమనే ద్రవ్యం శుద్ధమవుతూ వుంటుంది. ఇలాటి

సత్త్వాన్ని సంపాదించడమే వేదాంతంయొక్క ప్రధానా శయం. నే నిదివరకే చెప్పినట్లు ఆత్మ స్వతస్సిద్ధంగా శుద్ధం, పూర్ణం అయినది. కాని, అది రజస్సు, తమ స్సుల అణువులతో ఆవరించబడిందని వేదాంత సిద్ధాంతం. ఈ మూటిలో, సత్త్వాణువులు మిక్కిలి ప్రకా శవంతంగా వుంటాయి. వెలుతురుకూడ, అడ్డంగుండా చొచ్చుకొని పోజాలేంత సులభంగా ఆత్మయొక్క ప్రకాశం ఈ సత్త్వాణువులగుండా చొచ్చుకొని పోగలదు. కాబట్టి, రజస్తమస్సుల అణువులు పోయి సత్త్వాణువులు మిగి లితే, ఆ దశలో ఆత్మయొక్క మహిమ, అమలత్వం వ్యక్తమై ఆత్మస్వరూపాన్ని ఎక్కువగా ప్రకటిస్తుంది.

కాబట్టి ఈ సత్త్వాన్ని సంపాదించుకోవడం అవ సరం. ''ఆహారం శుద్ధంగా వున్నప్పుడు'' అని శాస్త్రోక్తి. ఈ ఆహారమనే మాటకు 'భోజనం' అని అర్థం చెప్పి రామానుజులవారు తమ సిద్ధాంతంలో దీనికొక ముఖ్య స్థానమిచ్చారు. అంతటితోపోక అది భారతదేశమంతకూ, అన్ని సంప్రదాయాలకూ వ్యాపించింది. కాబట్టి దీని అర్థమేమో బాగా ఆలోచించడం అవసరం. ఎందుకంటే రామానుజులవారి అభిప్రాయాన్ననుసరించి, ఈ ఆహార శుద్ధి మన జీవితంలో ప్రధాన విషయాలలో ఒకటి. ఆహా రాన్ని అపరిశుద్ధం చేసేది ఏదని శ్రీరామానుజాచార్యుల వారు ఆలోచిస్తున్నారు. మూడు విధాలైన దోషాలు అన్నాన్ని అపరిశుద్ధపరుస్తాయి. ఒకటి జాతి దోషం. అది ఆ పదార్థంయొక్క జాతికే స్వతస్సిద్ధమైంది. ఉదాహ

రణ: నీరుల్లి, వెల్లుల్లి మొదలైన వానిలో వాసన. రెండోది, ఆశ్రయ దోషం. ఇది ఆహారం ఎవరినుండి వస్తుందో, ఆ వ్యక్తివల్ల కలిగేది. దుష్టుల ఆహారం అపరిశుద్ధత కల్పి స్తుంది. భారతదేశంలో మహాపురుషు లెందరో తమ జీవితమంతటా, ఈ విషయాన్ని నిష్కర్షగా పాటించడం నేను స్వయంగా ఎరుగుదును. ఆ ఆహారం తీసికొని వచ్చిన వారెవరో, దాన్ని తాకిన వారెవరో తెలిసికొనేశక్తి వారికుండేది. అనేక పర్యాయాలు నా జీవితంలో ఈ విష యాన్ని నేను చూశాను. మూడవది నిమిత్త దోషం. అంటే అపరిశుద్ధ వస్తువులయొక్కగాని, విషయాల యొక్కగాని, దోషం ఆహారానికి తగలడం. దీన్ని గురించి మన మింక కొంత జాగ్రత్తగా విచారించడం మంచిది. మురికి, దుమ్ము, వెంట్రుకలు కలిసిన ఆహారాన్ని తినడం ఈ దేశంలో అలవాటైపోయింది. ఈ మూడు దోషాలు తొలగించబడిన ఆహారం సత్త్వశుద్ధిని కలుగజే స్తుంది. అంటే సత్త్వాన్ని శుద్ధిచేస్తుంది. ఆస్తిక ధర్మజీవన మప్పుడు మిక్కిలి తేలికగా ఆచరించే వీలుకల్గుతుంది. పరిశుద్ధమైన ఆహారాన్ని తినడమే ఆస్తికత అయితే ప్రతివాడూ ధర్మజీవనాన్ని ఆచరించగలడు. నాకు తెలిసి నంతలో, ఈ మూడు దోషాలను తొలగించుకో జాల నంత అప్రయోజకుడు, అశక్తుడు, ఈ ప్రపంచంలో ఎవడూ లేడు. ఇక శంకరాచార్యులవారు ఈ ఆహారశబ్దా నికి మనస్సులో చేరిన సంకల్పరాశి అని అర్థంచేసి, ఆ సంకల్పరాశి శుద్ధమైనప్పుడు సత్త్వం శుద్ధమవుతుందే

కాని, అంతవరకు కాజాలదని అంటున్నారు. నీ ఇష్టమైన దాన్ని నీవు తినవచ్చు. ఆహారం మాత్రమే సత్వాన్ని శుద్ధి చేస్తే ఇంకేమి? ఒక కోతిని తెచ్చి, అది బ్రతికి వున్నంత కాలం పాలతోను, అన్నంతోను పెంచినంత మాత్రాన అది మహాయోగి అవుతుందా? అలా అయితే ఆవులు, లేళ్లు, యోగిసత్తములే కదా? కొందరు భావించేటట్లు చాలా సార్లు స్నానం చేయడంతోనే స్వర్గం లభించేటట్లయితే, మొట్టమొదట చేపలు స్వర్గాన్ని చేరుతాయి. శాకాహారం చేతనే మనిషి స్వర్గానికి పోగలిగితే ఆవులు, లేళ్లు, వాని కంటె ముందుగా స్వర్గం చేరుకొంటాయి.

సరే, ఇక పరిష్కార మార్గమేమి? రెండూ అవసరమే. ఆహారాన్ని గురించి శంకరాచార్యులవారు తెలిపే అభిప్రాయమే నిస్సంశయంగా ముఖ్యమైంది. శుద్ధా హారం శుద్ధ సంకల్పాన్ని బలపరుస్తుందనడానికి సందే హంలేదు; ఈ రెంటికి దగ్గరి సంబంధముంది. కాబట్టి రెండూ అవసరమైనవే. కానీ, ఆధునిక భారతదేశంలో శంకరాచార్యులవారి బోధను మరచిపోయి, ''పరిశుద్ధ మైన ఆహారం'' అనే అర్థాన్నే పాటిస్తున్నాం. అందువల్లే, ఆస్తికధర్మం వంటింటిలో దూరిందని నేను చెప్పాను. అందుకు ప్రజలు నా మీద కోపావేశులయ్యారు. మీరు నాతో చెన్నపురి వచ్చివుంటే నా మాటలోని సత్యాన్ని మీరు గ్రహించగల్గేవారు. వంగదేశీయులు వారికంటే మేలు. ఇతరులు అన్నంవంక చూచినంత మాత్రంతోనే దాన్ని పారేసేవాళ్లు మద్రాసులో వున్నారు. ఇంతచేసినా,

అక్కడి ప్రజలు ఇక్కడి వారికన్నా ఉత్తములని చెప్ప జాలను. ఆహారనియమంవల్ల, భోజనకాలంలో దృష్టి దోషాన్ని పాటించడంవల్ల, పరిపూర్ణత వచ్చేలాగైతే, వారంతా సమగ్రులై వుండాలి. కానీ వారలా లేరు.

రామానుజ శంకరుల భావాలను రెంటిని సమన్వ యించి పూర్ణరూపాన్ని కల్పించవచ్చు. కానీ, అప్రధాన విషయానికిచ్చినంత ప్రాముఖ్య మీయతగదు. అలా ఇవ్వడం గుర్రానికి ముందు బండిని కట్టడం లాంటిది. తినదగినది ఈ ఆహారమా, ఆ ఆహారమా, అనే విష యాన్ని గూర్చి, వర్ణాశ్రమాచారాలను గూర్చి నేడు గందరగోళాలు చెలరేగుతున్నాయి. ఈ అరుపులలో వంగ దేశీయులు దిట్టలుగా వున్నారు. ''ఈ వర్ణాశ్రమాలను గూర్చి మీకేమి తెలుసు?'' అని మీలో ప్రతివానినీ నేను అడుగుతున్నాను. ఈ దేశంలో ఈనాడు, ఆ చతుర్వ ర్ణాలు ఎక్కడున్నాయి? నాకు జవాబు చెప్పండి. నాకవి కన్పించడం లేదు. మన వంగదేశపు ''తలయే లేని తల నొప్పి'' అనే సామెతలాగా, మీ రీ వర్ణాశ్రమాల నిక్కడ సృష్టింప జూస్తున్నారు. ఇక్కడఁ నాలుగు వర్ణాలు ఇప్పుడు లేవు. బ్రాహ్మణ, శూద్ర వర్ణాలు రెండే నాకు కనిపిస్తు న్నాయి. క్షత్రియులు, వైశ్యులు వుంటే వారేరీ? ఓ బ్రాహ్మణులారా! హిందూమతానుసారంగా వారిని - ప్రతి క్షత్రియుని, ప్రతి వైశ్యుని - యజ్ఞోపవీతాలు ధరించి, వేదాలను చదువుకోండని ఏల బోధించడం లేదు? ఒకవేళ వైశ్యులు, క్షత్రియులు వంగదేశంలో లేరను

కొందాం. బ్రాహ్మణులు, శూద్రులు మాత్రమే వున్న దేశంలో బ్రాహ్మణులు నివసించరాదని శాస్త్రాలు చెబుతున్నాయి కదా! కాబట్టి మూట ముల్లె సర్దుకొని వెళ్లిపోండి! మీరు వేయి సంవత్సరాలుగా మ్లేచ్ఛుల తిండితిని, మ్లేఛ్ఛుల సేవచేస్తున్నారు. అట్టివారిని గూర్చి శాస్త్రాలు ఏమి చెబుతున్నాయో మీకు తెలుసా? అందుకు ప్రాయశ్చిత్తమేమో ఎరుగుదురా? చేతులారా, తన్ను తాను కాల్చుకోవడం! మీరు గురువులమని పేరు పెట్టుకొని కపటవేషధారులై తిరుగదలచారా? మీకు, మీ శాస్త్రాల్లో విశ్వాసం వుంటే - అలెగ్జాండరు చక్రవర్తితో వెళ్లివుండిన కారణంగా, తాను మ్లేచ్ఛుని ఆహారం తిన్నట్లు భావించి, తన్ను తాను దహనం చేసికొన్న బ్రాహ్మణశ్రేష్ఠునిలాగా - మిమ్మల్ని మీరు వెంటనే దహనం చేసుకోండి! ఆ విధంగా చేస్తే ఈ జాతి అంతా మీకు పాదాక్రాంతం కాగలదు. మీరు మీ శాస్త్రాలను విశ్వసించరు. అయినా, ఇతరులు విశ్వసించాలని కోరుతున్నారు. పూర్వరీతిగా మీరు ఈ కాలంలో చేయజాలకపోతే మీ దుర్బలతను ఒప్పుకోండి; ఇతరుల దుర్బలతను క్షమించండి. వారికి చేయూతనివ్వండి. వారిని వేదాలు చదువుకోనివ్వండి; ప్రపంచంలోని ఇతర ఆర్యజాతులతో సరితూగే ఆర్యులు కానివ్వండి. మీరూ అలాగే ఆర్యులుకండి.

మీ దేశాన్ని మారణం చేస్తున్న హేయమైన వామాచారాన్ని వదలండి. మీరు భారతదేశంలోని ఇతర ప్రాంతాలను చూడలేదు. మన సంఘంలో ఎంతగా ఈ వామాచారం వ్యాపించిందో చూచినప్పుడు, మన నాగరికతను

గూర్చి ఎంతగా గర్వపడుతున్నా, మన సంఘానికి చాలా లజ్జాకరమైన దశ వాటిల్లినట్లే భావిస్తున్నాను. వంగ దేశంలో మన సంఘం వామాచార సాంప్రదాయికులనే తేనెటీగలకు తెనెపెరగా వుంది. పగలు బయటికివచ్చి ఆచారాన్నిగూర్చి పెద్దపెద్ద ఉపన్యాసాలు చేసే వాళ్లే, రాత్రుల్లో ఈ భయంకర వ్యభిచారాన్ని సాగిస్తూ, అతి ఘోరమైన గ్రంథాలను ప్రమాణం చేసికొంటున్నారు. ఆ గ్రంథాలు ఇలాటి నీచకార్యాలను చేయండని వారిని ఆజ్ఞాపిస్తున్నాయట! వంగదేశీయులగు మీకు ఆ సంగతి తెలుసు. వంగదేశ శాస్త్రాలన్నీ వామాచార తంత్రాలే. శ్రుతులను బోధించడానికి మారుగా బండ్లకొద్దీ ఆ తంత్రాలను ప్రకటించి మీ బిడ్డల మనస్సులలో విషాన్ని నింపుతున్నారు. కలకత్తా నగర జనకులారా! ఈ వామా చార తంత్రాలవంటి ఘోరగ్రంథాలు, వాటి అనువాదాల తోసహా మీ బాలబాలికల చేతుల్లోకి వచ్చి వారి హృద యాలను విషపూరితంగా చేసేయగా, ఈ బిడ్డలు అవే హిందువుల శాస్త్రాలనే విశ్వాసంతో పెరిగి పెద్దవారు కావడం మీకు సిగ్గుగా అనిపించడం లేదా? మీకు సిగ్గుంటే మీ బిడ్డల చేతులనుండి వాటిని పెరికి పారేసి, సత్యమైన శాస్త్ర గ్రంథాలను, వేదాలను, గీతను, ఉపనిషత్తులను వారిచే చదివించండి.

భారతదేశమందలి ద్వైత సాంప్రదాయకుల సిద్ధాం తాన్ననుసరించి వేర్వేరు జీవాత్మలు శాశ్వతంగా వేరుగానే వుంటాయి. భగవంతుడు నిమిత్త కారణమాత్రుడై అది

వరకే ఉన్న ద్రవ్యరాశినుండి జగత్తును సృష్టిచేస్తాడు. అద్వై తుల సిద్ధాంతం ప్రకారం భగవంతుడు జగత్తుకు నిమిత్త కారణం, ఉపాదాన కారణంకూడ అవుతున్నాడు. అంటే ఆయన ఈ జగత్తుకు సృష్టికర్త కావడమే కాక, దీన్ని తన లోనుండి సృష్టి చేస్తున్నాడు. ఇది, అద్వైతుల సిద్ధాంతం. జగత్తును, భగవంతుడు తనలోనుండే సృష్టించీ, ఆ జగత్తునుండి, తాను సదా, భిన్నుడుగానే వుంటాడనీ, సర్వమూ, ఆ జగదీశ్వరునికి సదా లోబడి వుంటుందనీ, నమ్మే అసంస్కృత ద్వైతసంప్రదాయాలు కొన్నిఉన్నాయి. భగవంతుడు, తనలోనుండే జగత్తును పరిణమింప చేసెననీ, జీవాత్మలు, చివరికి నిర్వాణాన్నిపొంది, ఖండ త్వాన్ని బాసి, అఖండబ్రహ్మమే అవుతాయనీ విశ్వసించే సంప్రదాయాలుకూడ ఉన్నాయి. కానీ, ఈ సంప్ర దాయాలు అదృశ్యమై పోయాయి. ఈనాడు భారత దేశంలో కనిపించే అద్వైత సంప్రదాయమంతా, శంకరా చార్యులవారిని అనుసరించే వారిదే. శంకరమతానుసారం, భగవంతుడే జగత్తుకు నిమిత్త కారణం, ఉపాదాన కారణం కూడ. మాయవల్ల ఇలా గోచరిస్తుందే కానీ, యథార్థంగా అలా కావడం లేదు. నిజానికి ఈ జగత్తు లేనేలేదు; ఉన్నది బ్రహ్మం ఒక్కటే. అద్వైత వేదాంతంలో గ్రహించ వలసిన అత్యంత మహనీయ విషయం ఈ మాయా వాదమే. మన తత్త్వశాస్త్రంలోని ఈ అత్యంత క్లిష్ట విషయాన్ని విమర్శించి చెప్పడానికి ఇప్పుడు, నాకు సమయం చాలదని నా భయం. మీలో పాశ్చాత్య తత్త్వ

శాస్త్రంతో పరిచయం కలవారికి ఇలాటి అంశ మొకటి క్యాంటు మహాశయుని సిద్ధాంతంలో గోచరించగలదు. కానీ, మీలో క్యాంటునుగూర్చి ప్రొఫెసరు మాక్స్‌ముల్లర్ గారి వ్రాతలను చదివినట్టి వారికి ముందుగా ఒక హెచ్చరిక చేస్తున్నాను. గొప్ప విపరీతార్థానికి దారితీసే భావమొకటి ఆ వ్రాతలలో వుంది. దేశకాల నిమిత్తం, మాయ, అభిన్నం అనే భావం మొట్టమొదట కనుగొన్నది శ్రీశం కరాచార్యులవారే! శంకరభాష్యంలో ఇందుకు నిదర్శనా లైన వాక్యాలను ఒకటి రెండు కనుగొని, నా మిత్రుడైన ప్రొఫెసర్ మాక్స్‌ముల్లర్‌గారికి పంపగల అదృష్టం నాకు కలిగింది. కాబట్టి ఆ సిద్ధాంతంకూడ భారతదేశంలో నిదే. అద్వైత వేదాంతుల ఈ మాయాసిద్ధాంతం చాలా చిత్రమైంది. నిజానికి ఉన్నదంతా బ్రహ్మమొక్కటే కాని, ఈ మాయవల్ల భిన్నత్వం ఏర్పడింది. ఏకత్వమే, అంటే, అద్వితీయ బ్రహ్మమే పరమప్రాప్యం. ఈ అంశంలో భార తీయ సిద్ధాంతానికి పాశ్చాత్య సిద్ధాంతానికీ మధ్య అనంత మైన విభేదం వుంది. వేలకొద్దీ సంవత్సరాలకు ముందే ఈ సిద్ధాంతాన్ని ప్రతిజ్ఞాపూర్వకంగా భారతజాతి ప్రపం చంలో నెలకొల్పింది. వేర్వేరు జాతులవారు దీని ఖండ నకు పూనుకొన్నారు. చివరికి వారంతా సమసిపోయారు. ఈ భారతజాతి మాత్రం అమరమై నిలిచివుంది. ఆ ప్రతిజ్ఞ ఇదే; ఈ జగత్తు భ్రాంతిమయం, ఇదంతా మాయ. నీవు నేలమీద విస్తరి వేసికొని వ్రేళ్లతో ముద్దలు చేసికొని తినేవాడివైనా, బంగారు పళ్లెంలో స్పూనుతో తినే

వాడివైనా, మహాసౌధాల్లో నివసించే సమ్రాట్టువైనా, శుష్క దరిద్రుడివైనా, మరణం ఒక్కటే చివరికి నీ గతి. అంతా సమమే. అంతా మాయే. ఇది ప్రాచీన భారతీయ సిద్ధాంతం. ఎన్నో జాతులు దీన్ని ఖండించడానికి, ఇది కల్ల అని రుజువు చేయడానికి పరంపరగా ప్రయత్నిస్తూనే వున్నాయి. వారు గొప్పవారై, భోగం గమ్యార్థంగా పెట్టు కొని, చేతిలో పూనిన అధికారాన్ని సంపూర్ణంగా విని యోగించి అత్యంత వైభవాలతో తులతూగుతున్నారు. కాని, మరుక్షణంలోనే మరణం పాలబడిపోతున్నారు. మనం అంతా మాయగా చూస్తూ శాశ్వతంగా నిలిచి వున్నాం. మాయయొక్క సంతానం శాశ్వతమై జీవిస్తూం డగా, భోగంయొక్క సంతానం విలయమందుతోంది!

మరొక గొప్ప భేదంకూడ వుంది. జర్మన్ తత్త్వ శాస్త్రంలో హెగెలు, స్కోఫెన్‌హోర్ మహాశయులు చేసిన ప్రయత్నాలవంటివే, సరిగా, అటువంటి భావాలే, ప్రాచీన భారతదేశంలో ప్రకటించబడ్డాయి. అదృష్టవశాత్తు, ఈ హెగెలు మతం, జడ్డిగంలోనే మిడతపోటు తిన్నది. అంటే, ప్రారంభంలోనే నశించింది. కాబట్టి, అది మొలకెత్తి వృక్షం కాలేదు. దాని శాఖలు పెరిగి వినాశకరమైన దాని ఊడలు, మన మాతృదేశంలో నాటుకోకుండాపోయాయి. అద్వితీయమైన అఖండతత్త్వం అల్లకల్లోలమైందనీ, వ్యక్తిత్వం పొంది, విడివడిన స్వరూపమే ఆ అఖండతత్త్వంకంటె ఉత్తమమనీ హెగెలు అభిప్రాయం. లోకమే అలోకంకన్నా గొప్పదనీ, సంసారమే నిర్వాణంకంటె శ్రేష్ఠతరమనీ,

అతడు తేల్చిచెప్పాడు. ఇదే అతని ప్రధాన భావం. మీరు, ఈ సంసారంలో దిగబడినకొలదీ, జీవన వ్యాపృత్తులచే మీ ఆత్మ ఆవరించబడినకొలదీ, మీరు గొప్పవారవుతూం టారట! ఆ సిద్ధాంతవాదులు ఇలా అంటారు: ''మే మెలా భవనాల్ని నిర్మిస్తున్నామో, రాజవీథుల్ని ఎలా శుభ్రపరు స్తున్నామో, ఇంద్రియభోగాలను ఎలా అనుభవిస్తున్నామో, గమనించండి.'' ఈ ప్రతి అల్ప భోగానికి వెనుక ద్వేషం, దుఃఖం, భయం, దాగివుండవచ్చు.

ఇక మన తత్త్వవేత్తలు ఇలా కాక, ప్రప్రథమం నుండి, పరిణామ మనే పేరుతోవున్న వ్యక్తీకరణమంతా, ఆ అవ్యక్తతత్త్వం వ్యక్తంకావడానికి చేసే వృథాప్రయత్నాలే అని పల్కుతున్నారు. ఈ విశ్వానికంతటికీ ప్రధాన కారణ రూపమైన నీవు క్షుద్రమైన బురదగుంటల్లో ప్రతిబింప చూస్తున్నావు. కానీ, కొంతకాలం అలా ప్రయత్నించిన తర్వాత, అలాటి ప్రయత్నమంతా వ్యర్థమని తెలిసికొని వెనుదిరిగి నీ వెక్కడినుండి వచ్చావో అక్కడికే మరలి పోతావు. ఇదే వైరాగ్యం. లేక సర్వసంగ పరిత్యాగం. ఇదే మతధర్మానికి ప్రారంభం. మతంకానీ, నీతిధర్మంకానీ, ఆత్మార్పణ బుద్ధిలేక ఎలా ప్రారంభం కాగలవు? సంగత్యా గమే దీనికి ''ఓ, నా, మా, ''లు. ''త్యాగం చేయి,'' ''త్యాగం చేయి'' అని వేదాలు ఘోషిస్తున్నాయి. పరి త్యాగం చేయి. అదొక్కటే మార్గం. ''నప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వ మానశుః'' (సంతానంవల్ల కానీ, సంపదవల్ల కానీ, అమృతత్వాన్ని పొందజాలవు. త్యాగం

చేత మాత్రమే అది సాధ్యమవుతుంది.) భారతీయ గ్రంథాలలోని శాసనం ఇదే. సింహాసనాల్ని అలంకరిస్తూ కూడ, సంసారత్యాగం చేసిన వారున్నారు! జనకమహా రాజుకూడ సర్వపరిత్యాగం చేశాడు. జనకుని మించిన గొప్పత్యాగి ఎవరు? ఈ రోజుల్లో, అందరం జనకుల మనిపించుకోవాలని, ఉబలాటపడుతున్నాం. ఔను. కూటికి, గుడ్డకు, దిక్కులేక అల్లాడుతున్న దీనసంతానా నికి వీరు జనకులే.* వీరికి జనకనామం, ఈ విధంగా వర్తి స్తుంది. పురాణ ప్రసిద్ధుడైన ఆ జనకునికిగల భవ్య దివ్య భావాలు, వీరిలో పూజ్యం! వీరే మన అభినవ జనకులు! ఇప్పుడు, ఇలాటి జనకత్వాన్ని కొంచెం త్యాగంచేసి, లక్ష్యాన్ని గుర్తించి నడవండి. మీరు త్యాగం చేయగలిగారా, మీకు ఆత్మధర్మం చేజిక్కుతుంది. అలా చేయలేరా, తూర్పునుండి, పడమర వరకు ప్రపంచంలోవున్న పుస్త కాల నన్నిటినీ, మీరు పూర్తిగా చదువుదురు గాక! గ్రంథా లయాలన్నిటినీ గుటకవేసి మ్రింగుదురుగాక! గొప్పపం డితు లవుదురు గాక; కర్మకాండను మాత్రమే పట్టుకొని వ్రేలాడితే, మీరు వ్యర్థులే! మీకు ఆత్మసిద్ధికలుగదు. త్యాగం వల్లనే, ఈ అమృతత్వాన్ని పొందడం సాధ్యం. వైరాగ్య మొక గొప్పశక్తి - విశ్వాన్నంతను ధిక్కరించి నిలువగల మహాశక్తి. తత్ప్రభావంతో మాత్రమే ''బ్రహ్మాం డమ్ గోష్పదాయతే'' (ఈ బ్రహ్మాండమంతా ఆవు అడుగు లాగా చిన్నిగుంట లాంటి దవుతుంది.)

* జనకుడనే పదానికి తండ్రి అని అర్థం.

ఈ వైరాగ్యమే మన భారతదేశ మహాధ్వజం! లోక మంతటిపైనా అది ఎగురుతోంది. మృత్యువు వాతబడిపో తున్న జాతుల్ని హెచ్చరించడంకోసం, నిరంకుశ ప్రభువు లను మందలించడంకోసం, లోకంలోని దుష్టులను అద లించడంకోసం, పదేపదే భారతదేశం ప్రకటిస్తున్న అన శ్వర భావమిదే! హిందూ ప్రజలారా! ఈ ధ్వజాన్ని మీ చేతులనుండి జారిపోనీయకండి! ఆకాశంలో ఎగిరేలా దాన్ని మీరు పట్టుకొని వుండండి! మీరు దుర్బలులై త్యాగం చేయలేకున్నా, ఆదర్శాన్నిమాత్రం క్రిందికి లాగ కండి. ''నేను దుర్బలుడను. సంసారత్యాగం చేయజా లను'' అని ప్రకటించండి. కానీ శాస్త్రాలను తికమకచేస్తూ, మోసపు వాదనలకు దిగి, కపట వేషధారులు కావాలని చూడకండి! అజ్ఞానులైన ప్రజల కళ్లలో దుమ్ముకొట్టాలని ప్రయత్నించకండి. ఆ పనిమాత్రం చేయద్దు. మీ లోపాన్ని మాత్రం ఒప్పుకోండి. ఆ త్యాగసిద్ధాంతం మహామహి మాధ్యమైంది. ఆ ప్రయత్నంలో లక్షలకొద్దీ కార్యసిద్ధిని పొందజాలకున్నా మునిగిపోయిందేముంది? పదిమంది - ఇద్దరైనా - శూరాగ్రేసరులు విజయశీలురై తిరిగివస్తే చాలదా? అందులో ప్రాణాలు కోల్పోయిన లక్షలాది యోధులు ధన్యులు. వారోడ్చిన నెత్తురే ఈ విజయాన్ని సంపాదించేది! బొంబాయి రాష్ట్రంలోని వల్లభాచార్య సంప్రదాయమొక్కటి తప్ప, ఆయా వైదిక సంప్రదాయా లన్నిటిలో, వైరాగ్యమే అద్వితీయంగా వుంది. వైరాగ్యం లోపిస్తే ఏమి తటస్థిస్తుందో, మీలో చాలామందికి తెలుసు

కదా! మనకు పూర్వాచారం కావాలి! అందులో బీభత్సమైన పూర్వాచారాన్ని పాటించేవారు సైతం, ఊపిరాడకుండ ఒళ్లంతా బూడిదతో కప్పుకొనేవారు సైతం, చేతులు పైకి ఎత్తుకొని నిలుచునేవారు సైతం మనకు అవసరమైనవారే! వారి చర్య అస్వాభావికంగా వున్నా వారు మనకు త్యాగభావాన్ని బోధిస్తున్నారు. భారతదేశంలోకి చొరబడి వచ్చి, మన ఆయువుపట్టులనే తినివేస్తూ మన జాతినంతను నిర్వీర్యులనుగా, బేలలనుగా, కపటవేషగాండ్రుగా చేస్తున్న విలాస పరాయణత్వానికి లోబడిపోవద్దని, మన జాతిని వారు హెచ్చరిస్తున్నారు. మనకు వైరాగ్యం కొంచెం అవసరం. ప్రాచీనకాలంలో వైరాగ్యం భారతదేశాన్ని జయించింది. అది, మళ్లీ భారతదేశాన్ని జయించాలి. ఇప్పుడు సైతం, ఈ వైరాగ్యమే భారతీయాదర్శా లన్నిటిలో మిక్కిలి ఉదాత్తం, ఉన్నతం అయి ప్రకాశిస్తోంది. బుద్ధదేవుని దేశం, రామానుజుని దేశం, శ్రీరామకృష్ణుని దేశం, వైరాగ్యానికి పుట్టినిల్లయిన దేశం, ఎక్కడ పూర్వకాలం నుండి కర్మకాండను ఖండించే బోధలు వెలశాయో, అలాటి దేశం; ఎక్కడ ఈనాడు సైతం సర్వసంగ పరిత్యాగం చేసి జీవన్ముక్తులైన మహాత్ములు వందలకొద్దీ వున్నారో, ఆ దేశం, - అలాంటి దేశమేనా తన పరమాదర్శాలను విడనాడేది? ఎన్నటికీ కాదు. భోగపరములైన పాశ్చాత్య ఆదర్శాలతో తలలు తిరిగిపోయినవారు. కొందరుండవచ్చు! వెక్కసమయ్యేలా, ఇంద్రియభోగాలను - పశ్చిమదేశాలను పాడుచేసి లోకాన్ని శాపగ్రస్తం చేసిన

ఇంద్రియభోగాలను - పూర్తిగా అనుభవించే మనుషులు వేలకొద్దీ లక్షలకొద్దీ ఉందురుగాక! అయినా ఈ నా మాతృభూమిలో ఆ మత ధర్మాన్నే సత్యమని నమ్మి, ఎంతటి కష్టాలొచ్చినా లెక్కచేయక, అవసరమైతే సమస్తమూ బలి ఇవ్వడానికి సంసిద్ధంగా వుండేవాళ్లు వేలకొద్దీ మహనీయులు నిలిచేవుంటారు!

మన సంప్రదాయాలన్నీ సర్వసామాన్యంగా పాటించే మరొక ఆదర్శాన్ని మీ కిపుడు నివేదించాలనుకొంటున్నాను. అదికూడ , మహావిస్తృత రూపమైందే! ''మత మనేది ప్రత్యక్షానుభవానికి తెచ్చుకోవలసిన విషయం''- అనే అనన్య సామాన్యసిద్ధాంతం ఈ భారత దేశంలో మాత్రమే కనిపిస్తోంది. ''నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునాశ్రుతేన'' - ''ఈ ఆత్మ ప్రసంగాలచేత లభ్యమయ్యేదికాదు; బుద్ధి బలంచేత కూడ లభ్యమయ్యేది కాదు; విశేషమైన వేదాధ్యయనం చేతకూడ లభ్యమయ్యేది కాదు.'' ''వేదపఠనం వల్ల సైతం ఆత్మ లభ్యం కాదు'' అని ప్రకటించేది ప్రపంచంలో మన వేదమొక్కటే. ఏ ఇతర ధర్మగ్రంథంలోను, ఇలాటి ప్రకటన కానరాదు. ప్రగల్భాలు పనికిరావు; ఉపన్యాసాలు వ్యర్థం. ఇలాటి వేవీ ఉపకరింపజాలవు; అయినా, ఆత్మను ప్రత్యక్షానుభూతికి తెచ్చుకోవాలి. అది గురువువల్ల శిష్యునికి లభిస్తుంది. శిష్యునికి ఈ అంత ర్దృష్టి లభించినప్పుడు అంతా తేటతెల్లమౌతుంది. అంతట ఆత్మసాక్షాత్కారం అనుభవంలోకి వస్తుంది.

ఇంకొక భావం. కులగురువు, లేక వంశపారంపర్య గురువు అనే ఒక వింతఆచారం వంగదేశంలో ఉంది. ''నా తండ్రి నీకు గురువు. కాబట్టి ఇప్పుడు, నేను నీ గురువును. నా తండ్రి నీ తండ్రికి గురువు. కాబట్టి నేను నీకు గురువుగా వుంటాను.'' గురువు అంటే ఏమి? వెనక్కి తిరిగి శ్రుతులలో ఏముందో చూద్దాం. ''వేదరహస్యం తెలిసినవాడు గురువు.'' కాని, గ్రంథావలోకన వ్యగ్రులు కానీ, వైయాకరణులుగానీ, పండితులుకానీ, అంత మాత్రం చేతనే గురువులు కాజాలరు. పరమార్థం తెలిసినవారే గురువులు. ''యథా ఖర శ్చందన భారవాహీ భారస్యవేత్తా నతు చందనస్య'' - (గంధపు చెక్కలు మోసే గాడిదకు ఆ చెక్కల బరువు తెలుస్తుందే తప్ప, వాటి సుగంధం తెలీదు.) అలాటి వా రీ పండితులు. అలాటివాళ్ళు మనకు అవసరం లేదు. వాళ్ల కీ అపరోక్షానుభూతి లేకుంటే, వారేమి బోధించగలరు? ఇక్కడ, ఈ కలకత్తా నగరంలో నేను బాలుడిగా వున్నప్పుడు, మత ధర్మాన్ని తెలిసికోగోరి ఎన్నోచోట్లకు వెళ్లేవాడిని. ప్రతిచోట, పెద్దపెద్ద ఉపన్యాసా లిస్తూండేవారు. చెప్పిందంతా విని, ''మీరు దేవుణ్ణి చూశారా'' అని అడిగేవాడిని. ఆ ఉపన్యాసకుడు ''భగవంతుని చూడటం'' అనే మాట వినగానే తికమకపడేవాడు. ''నేను చూశాను'' అని నాతో చెప్పిన మహాత్ముడు, శ్రీరామకృష్ణ పరమహంస ఒక్కరే. అంతేకాక, ''భగవంతుని చూసేమార్గం, నీకుకూడ చూపుతాను'' అని అన్నారు. గురువు అంటే శాస్త్రవాక్యా

లను పీడించి తికమకలు చేసేవాడు కాడు. 'వాగ్వైఖరీ శబ్ద ఝురీ, శాస్త్ర వ్యాఖ్యాన కౌశలం వైదుష్యం విదుషాం తద్వ ద్భుక్త యే నతు ముక్తయే'' (శబ్ద ప్రయోగవైచిత్రి, అనర్గళమైన ఉపన్యాసశక్తి, శాస్త్ర వాక్యాలను వివరించే నేర్పు, పండితుల భుక్తికోసమే కానీ, ముక్తికోసం కాదు.) 'శ్రోత్రియః' అంటే శ్రుతుల రహస్యం తెలిసినవాడు. ''అవృజినః'' - అంటే పాపరహితుడు. 'అకామహతః'' - కామహతుడు కానివాడు, బోధించడంచేత డబ్బు సంపాదించడానికి కోరికలేనివాడు, శాంతుడు, సాధువు అయినవాడు గురువు. అతడు వసంతఋతువు లాంటి వాడు. అది, ఆయా వృక్షాలకు ఆకులను పూలను కల్పిం చినా, ఉపకారం చేయడం తన స్వభావం కాబట్టి ఆ చెట్ల నుండి ఏమీ కోరుకోదు. గురువు అంటే అలాటివాడు. ''తీర్ణాఃస్వయం భీమ భవార్ణవం జనాన్ అహేతు నాన్యా నపి తార యంతః'' (ఈ ఘోర సంసార సాగరం తాను దాటి, ఏమాత్రం లాభాపేక్షలేక, ఆ సముద్రాన్ని ఇత రులు దాటడానికి సాయపడేవాడే గురువు.) ఇతరుడు గురువు కాలేడని తెలుసుకోండి. ''అవిద్యాయా మంతరే వర్తమానాః స్వయం ధీరాః పండితమ్మన్యమానాః। జంఘన్యమానాః పరియంతి మూఢాః అందే నైవ నీయ మానా యథాంధాః'' (స్వయం అజ్ఞానాంధకారంలో మునిగి వుండీ, గర్వంతో, తమకంతా తెలుసుననుకొనే మూఢులు ఇతరులకు సాయపడగోరి, తూలుతూ, తూలుతూ, నానావక్రగతులపడి గిరగిర తిరుగుతారు.

గ్రుడ్డివారు గ్రుడ్డివారికి త్రోవచూపబూనితే ఉభయులు గోతిలో పడతారు కదా!) ఇది వేదవాక్యం. దీనితో మీ ప్రస్తుతాచారాన్ని పోల్చి చూచుకోండి. మీరు వేదాంతులు, విధ్యుక్త మార్గవర్తులు. అవునా? మీరు ఉత్తమ హిందువులు, శిష్టాచారపరులు. సరే, నేను కోరేది, మీరు మరింక శిష్టాచారపరులు కావాలని. మీరు అధికాధికంగా, పూర్వాచారపరులైనకొద్దీ, అధికాధిక వివేకవంతులవుతారు అధికాధికంగా నవీనాచారపరాయణులైనకొద్దీ, అధికాధిక మతిహీనులైపోతారు. మళ్లీ, మీ పూర్వపు సదాచారాన్ని అవలంబించండి. ఏలంటారా? ఆ దినాలలో ఈ పుస్తకాలనుండి వెలువడిన ప్రతిశబ్దం, దృఢం, సుస్థిరం, నిష్కపటం అయిన హృదయంనుండి వెలువడిందే! ప్రతి స్వరమూ నిష్కళంకమే. అటు తర్వాత, పతనం వచ్చింది కళల్లో, శాస్త్రాలలో, మతంలో, ప్రతి దానిలో జాతికంతటికీ భ్రష్టత్వమే కల్గింది. కారణాలను గూర్చి విమర్శించడానికి మనకు కాలం చాలదు. ఆ కాలంలో (ఆ భ్రంశకాలంలో) వ్రాయబడిన పుస్తకాలన్నీ విషజాడ్య పూరితాలు, జాతీయతాపతన సూచకాలు; జవసత్త్వాలకు మారుగా ఏడ్పులను, పెడబొబ్బలను మాత్రం వెలువరించాయి. బలమహితం, చైతన్య మహితం అయిన ఆ పూర్వదినాలకై మరలండి. వెనక్కి పోండి! ఆ ప్రాచీన నిర్ఝరిణులనుండి, కడుపార సుధారసం గ్రోలండి. మళ్లీ శక్తివంతులుకండి. భారతదేశం సజీవం కావడానికి అదొక్కటే మార్గం.

అద్వైత సిద్ధాంతం ప్రకారం, నేడు ఘనకున్న వ్యక్తిత్వం భ్రాంతి మూలకమ్మైంది. ప్రపంచ మందం తటా, ఇది దురవగాహ విషయంగానే ఉంది. ఎవనితో నైనా, నీ కొక ప్రత్యేక వ్యక్తిత్వం లేదని చెప్పు. తన వ్యక్తిత్వం ఎలాంటిదో తెలీకపోయినా, అది పోతుందేమో అని అతడు చాలా భయపడతాడు. కానీ ఎన్నడూ వ్యక్తి త్వమనేదే లేదనీ, నీ జీవితంలో ప్రతిక్షణం, నీవు మారు తూనే వున్నావనీ, అద్వైతమతం బోధిస్తోంది. నీవు బాలు డివిగా వున్నావు. అప్పుడు ఒక విధంగా భావించేవాడివి. ఇప్పుడు యువకుడివి. ఇప్పుడు వేరొక విధంగా భావిస్తు న్నావు. ఇక ముసలివాడి వవుతావు. అప్పుడు ఇంకొక విధంగా భావిస్తావు. ప్రతివాడూ, ఎప్పుడూ మారిపోతూ వుంటాడు. అలా వుండగా, ఇంక నీ వ్యక్తిత్వ మెక్కడ? అది నీ శరీరంలోగానీ, నీ సంకల్పంలోగానీ, లేదనడం స్పష్టం. వీటి అన్నిటికీ లోపల నీ ఆత్మ వుంది. ఆ ఆత్మ బ్రహ్మమే అని అద్వైతి చెబుతున్నాడు. రెండు అఖండ పదార్థాలుండజాలవు. ఉన్నది ఒక వ్యక్తే; అది అఖండం. మనం తార్కిక జీవులంకదా? హేతుబద్ధ విచారమేకదా మనకు తృప్తికరం? సరే! ఆ తర్కవిచార మెలాంటిది? అది వర్గీకరణ రూపమ్మైంది. ఆ వర్గీకరణం చేసికొంటూ పోయిపోయి, ఇక ముందుకు పోజాలక, ఆగిపోతావు. ఖండవస్తువు అఖండంగా వర్గీకరించబడినప్పుడు కానీ, అంటే అఖండంలో చేర్చబడినప్పుడు కానీ, దానికి విశ్రాంతి దొరకదు. ఏదైనా ఒక ఖండవస్తువును తీసి

కొని దానిని వేర్వేరుగా విభజిస్తూ పో. చివరికి అఖండ పదార్థాన్ని, లేక ఆ పరంధామాన్ని చేరేవరకు నీకెక్కడా విశ్రాంతి చిక్కదు. ఉండేది ఆ అఖండ వస్తువు మాత్రమే అని వేదాంతి అంటున్నాడు. తక్కినదంతా మాయ. తక్కిందేదీ, సత్యత్వం కలది కాదు, ఏ భౌతిక వస్తువు లోనైనా సత్యమై ఉండేది ఈ బ్రహ్మమే. మనమూ ఈ బ్రహ్మమే. ఈ ఆకారం మొదలైనవన్నీ మాయ. ఈ ఆకారాన్ని, ఈ రూపాన్ని తొలగించావా? నీవు, నేను, అందరమూ ఒకటే. కానీ, నేను అనే శబ్దాన్ని గురించి మనం జాగ్రత్తపడాలి! సామాన్యంగా, ''నేను బ్రహ్మము అయితే, ఇది ఎందుకు చేయలేను? అది ఎందుకు చేయలేను?'' అని జనులు శంకిస్తారు. కాని, ఇక్కడ, ''నేను'' అనే శబ్దాన్ని వేరే అర్థంలో ప్రయోగిస్తున్నాం. నీవు బద్ధుడివని అనుకొంటే, ఇక బ్రహ్మం కావు. ఏ కొరతా లేక కాంతి అంతా తన లోపలనేకల ఆ పరమాత్మను కాజాలవు. అతని ఆనందమంతా, అతని సుఖాలన్నీ అతని లోపలనే ఉంటాయి. అతడు సర్వసమగ్రుడు, స్వయం తృప్తుడు. అతని కే కొరతా లేదు. అతడు దేన్నిగానీ అపేక్షించడు. పూర్తిగా నిర్భయుడు. సంపూర్ణ ముక్తుడు. బ్రహ్మమంటే ఇదే. దీనిలో మనమందరం ఒక్కరమే!

కాబట్టి ద్వైతులకు, అద్వైతులకువున్న ముఖ్యభేదం ఇదే అనవచ్చు. శ్రీశంకరాచార్యులవారివంటి గొప్ప భాష్యకర్త సైతం, కొన్ని వాక్యాలకు, నాకు అసమంజసములని తోచే అర్థాలను కొన్నిసందర్భాల్లో చెప్పాడు. ఒక్కొక్క

చోట, రామానుజాచార్యులవారు వాక్యాలకు అర్థాలు చెప్పే పద్ధతికూడ అంత విస్పష్టంగా వుండదు. ''ఏకం సద్విప్రా బహుధావదంతి-'' 'ఉండే వస్తువు ఒకటే ప్రాజ్ఞులు దానికి అనేకపేర్లు పెట్టారు' అనే మహోద్భుతభావాన్ని ఎన్నడో, భారతదేశం కన్గొని, ఇకమీదట ప్రపంచానికి ప్రసాదించవలసివున్నా, ఈ శ్రుతియొక్క అభిప్రాయానికి విరుద్ధంగా, ఒక్క సంప్రదాయమే సత్యం కాగలదనీ, తక్కినవన్నీ అసత్యాలనీ, ఒక దుర్భావం, మన పండితులలో సైతం వుంది. ఈ ''ఏకం సద్విప్రా బహుధా వదంతి'' అనే సిద్ధాంతమే ఈ జాతి బ్రతుకు తెరువును ఇంతవరకు తీర్చిదిద్దింది. కానీ కొద్దిమంది ప్రాజ్ఞులుతప్ప, అంటే కొద్దిమంది పారమార్థిక సాధకులు తప్ప, ఈ సూత్రాన్ని అందరు తరుచుగా మరచిపోతూనే వున్నారు. అవును, ఈ మహాసూత్రాన్ని మనం ఎప్పటికప్పుడు మరచిపోతూనే వున్నాం. అద్వైతమో, ద్వైతమో, విశిష్టాద్వైతమో, ఏదో ఒక్కటి మాత్రమే సత్యమై వుండాలి - అని అభిప్రాయపడేవారు పండితులలో నూటికి తొంభై ఎనిమిదిమంది వుంటారనుకుంటాను. మీరు కాశీకి వెళ్లి అక్కడి ఘట్టాలలో ఒకదాని దగ్గర కొంచెంసేపు కూర్చుంటే నా మాటల సత్యం మీకే తెలిసిపోగలదు. ఈ వివిధ సంప్రదాయాల గూర్చి, భిన్న భిన్న విషయాలగూర్చి, ఎడతెరిపిలేని ఆబోతు కుమ్ములాటలు అక్కడ ఎప్పుడూ జరుగుతూనే వుంటాయి.

అది అలా జరుగుతూనే వుంది. ఈ సందర్భంలో భారతదేశంలో, మహాపురుషుడైన శ్రీరామకృష్ణ పరమ హంస అవతరించారు. భారతదేశంలోని భిన్నభిన్న సంప్ర దాయాల్లో అంతర్లీనమైవున్న సామరస్యానికి ఆయన జీవితం ఆచరణరూపమైన వ్యాఖ్యానం. జ్యోతి శ్శాస్త్రంలోని ''భూమధ్య సిద్ధాంతం'' ''సూర్యమధ్య సిద్ధాంతం'' లాగా, ఈ రెండు సిద్ధాంతాలుకూడ అవ సరమే అని ఆయన జీవితమే స్పష్టం చేస్తోంది. జ్యోతి శ్శాస్త్రంలో భూమే కేంద్రం అనే సిద్ధాంతం మొదట నేర్ప బడుతుంది. ఈ సిద్ధాంతాన్ని ఆధారం చేసికొని విద్యార్థి ఇలాటి భావాలతోనే ఖగోళశాస్త్రాన్నంతా గ్రహిస్తాడు. కానీ ఖగోళశాస్త్రంలోని సూక్ష్మాంశాలను నేర్వ ప్రారంభించిన ప్పుడు వాటి నడుమ వుండేది సూర్యుడనే సిద్ధాంతం అవసర మవుతుంది. అప్పుడది వానికి చాలాబాగాకూడ తెలుస్తుంది. సహజంగా ఇంద్రియ సంబంధమైన సిద్ధాంతం ద్వైతం. ఇంద్రియాలు మనకు పరిమితులు పెట్టేంతవరకు సగుణబ్రహ్మమును మాత్రమే మనం చూడగల్గుతాం; సగుణమును తప్ప ఇతరమును తెలిసికో జాలం. ఈ ప్రపంచంలో వున్నది వున్నట్లు మనం గ్రహించి తీరాలి. ''నీ వొక శరీరమవని భావించు కొంటూ వున్నంతకాలం, నీవు ఒక జీవుడవని భావించు కొంటూ వున్నంతకాలం, నీ వొక మనస్సువని భావించు కొంటూన్నంతకాలం, ఆత్మ, ప్రకృతి, వాటి సృష్టికర్త అనే

మూటినీ ప్రతి అనుభవంలో నీవు పొందక తప్పదు'' అని శ్రీరామానుజాచార్యులవారు చెబుతున్నారు. అయినప్పటికీ మనస్సు సూక్ష్మతరమవుతూ పోయిపోయి చివరికి ఇంచుమించుగా లయం చెందినప్పుడు, మనకు భయం కలిగించేవి, దుర్బలుల చేసేవీ, మనల్ని ఈ స్థూల దైహిక జీవితంలో బంధించి వుంచేవీ అయిన ఆయా విషయాలన్నీ అదృశ్యములై పోయినప్పుడు, ఈ శరీరభావం సైతం అదృశ్యమవుతుంది. అలాటి స్థితి లభించినప్పుడు కానీ ఈ ప్రాచీన దివ్యసిద్ధాంతంయొక్క సత్యం బోధపడజాలదు. ''ఇహైవ తైర్జితః సర్గో ఏషాం సామ్యే స్థితం, మనః। నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తేస్థితాః'' - (సమస్తమును సమంగా చూడటంలో ఎవరి మనస్సులు సుస్థిరమైనవో, వారు ఈ జన్మలోనే జనన మరణ చక్రాన్ని దాటుతున్నారు. ఏలంటే బ్రహ్మం నిర్మలం, సర్వసమమూ అయినట్టిది. కాబట్టి, అలాంటి వాళ్లు బ్రహ్మంలోనే జీవిస్తున్నట్లు చెబుతారు.)

''సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరం।
న హిన స్త్యాత్మ నాత్మానం తతో యాతి పరాంగతిం॥

''ఇలా, ఈశ్వరుని సర్వత్రా సమంగా చూచే యోగి, ఆత్మను ఆత్మచే హింసించుకోడు. అతడు పరమగతినే పొందుతాడు.''


ACC. 98912

## మా ప్రచురణలలో కొన్ని...

జగద్గురువులు

నా ఐరోపా యాత్ర

రామాయణం

మహాభారతం

మన ఇతిహాసకథలు

గీతోపన్యాసాలు

భారతీయ మహిళ

ఆధునిక భారతదేశం

సాంఖ్య దర్శనం

పవహారిబాబా జీవిత సంగ్రహం

భవిష్యన్మతం వేదాంతమా?

అపరోక్షానుభూతి



శ్రీరామకృష్ణ మఠం
మైలాపూర్, మద్రాసు 600 004

Sarvatomukha Vedantam (Telugu) Rs.8.00
ISBN 81-7120-810-X